‘ నా బోధన - ఆ పదాన్ని మీరు వాడదలచుకుంటే - దానికి, ఎటువంటి ‘కాపీరైట్’ లేదు. దీన్ని మీరు పునర్ముద్రించడానికి గాని, పంపిణీ చేయడానికి గాని, తప్పుగా వ్యాఖ్యానించడానికి గాని, దాన్ని వికృతపర్చడానికి గాని, పాడుచేయడానికి గాని, దాన్ని మీ స్వంతమని ప్రకటించుకోవడానికి గాని మీకు పూర్తి స్వేచ్ఛ ఉంది, అందుకు నా అనుమతి గాని, ఇంకెవరి అనుమతి గాని అఖ్ఖర్లేకుండానే ! ’

- యూజీ కృష్ణమూర్తి

**వినదగు యూజీ చెప్పిన ...**

ప్రథమ ముద్రణ : 2012

ప్రతులు : 900

వెల : రూ. 100/-

ప్రతులకు :

**రాజశేఖర్ పాలడుగు**

స్నేహకుటి, నేరెళ్ళవలస కోలనీ,
భీమునిపట్నం, విశాఖపట్టణం జిల్లా.
ఫోన్ : 98496 35847, 99122 04999

ముద్రణ :

**వంశీకృష్ణ ప్రింటర్స్**

48-7-55/1, శ్రీనగర్
విశాఖపట్టణం - 530 016.
ఫోన్ : 0891-6617988

# నా మాట

యూజీ ఎవరో, ఏమిటో నాకు తెలీదు. గురు సారిస్ 'స్నేహకుటి'లో యేటా ఆయన పుట్టినరోజు జరుపుతున్నా, స్నేహితులు ఆయన్ని చూడ్డానికి వెళ్తున్నామన్నా, ఫ్రెంచ్ మిత్రుడు పాస్కల్ మా కబుర్లలో అల్లర్లలో ఉన్నట్టుండి 'యూజీ మీకు బాగా Suit అవుతాడు, ఆయనపై ముకుందరావు రాసిన పుస్తకం తప్పకుండా చదువ'మన్నా నాకే ఆసక్తి కలుగలేదు యాధృచ్ఛికంగా మరో మిత్రుని ద్వారా అదే పుస్తకం నా చేతికొచ్చిందాకా. ఇన్నేళ్ళూ ఏదో అదృష్టం నన్ని పెనుతుఫాను అంచుల్లోనే ఉంచి రక్షించిందేమో అనుకున్నా. యెందుకంటే యూజీ అంటే సమస్తం సర్వార్పణం. వదలాల్సింది గానీ, చేయాల్సింది గానీ, మారాల్సింది గానీ ఏమీ లేదంటూనే వంగిన మన నడుములపై ఘనమని అనాదిగా మోస్తున్న విలువైన మూటల్ని ఊడదీయించి ఒక్కో వజ్రాన్నీ గులకరాయిగా చూపి పారేయిస్తాడు మనతోనే. ఊత కర్రల్ని తన్నేసి 'భయం లేదు, నిటారుగా నడువ'మంటాడు.

'మీకే తోవా లేకుండా ఓ మూలకి నెట్టేయడమే నా పన'న్న యూజీ ఓ మెషిన్ గన్. ఎటు తిరిగితే అటు, ఏ వివక్షా, కనికరమూ లేకుండా సమస్త మతాల్నీ, సిద్ధాంతాల్నీ, విశ్వాసాల్నీ, గురువుల్నీ, మానవ ఆలోచనాజనితమైన సమస్తాన్నీ, ప్రతి **'కదలిక'**నీ పేలుస్తో సాగేవి ఆయన సంభాషణలు. యూజీ 49 వ యేట ('విపత్తు'గా యూజీ వర్ణించే) జ్ఞానోదయ స్థితి కలిగినప్పుడు ఆయనకు మరణాననుభవమయ్యింది. అది అనుభవం కాదు, వ్యక్తికి సంబంధించిన సమస్తమూ ఆఖరయ్యి, అంతమయ్యి దేహంలోని ప్రతి కణమూ జీవ పరివర్తన చెందే ఈ ప్రక్రియనే అసలైన 'మరణ'మనే వారు యూజీ. అప్పటినుండి ఆయన 89 వ యేట మన నుండి పూర్తిగా అదృశ్యులయ్యే ఆఖరి మరణం వరకూ (మనం మృత్యువు అనుకునేది అసలైన మృత్యువు కాదనీ, అది అణువులు అటూ ఇటూ మారడం మాత్రమే అనేవారు యూజీ), వివిధ కాలాల్లో వ్యక్తులతో ఆయన సాగించిన విస్ఫోటపు సంభాషణల నించి కొందరు మిత్రులు సేకరించిన శకలాలివి.

వీటి స్వచ్ఛతకూ, సూటిదనానికి అబ్బురపడి, ఈ పరమ సత్యాలకు ఎవరైనా తెలుగు చేస్తే బావుండుననుకున్నాను. 'ఎవరో ఎందుకు? నీవే చేయ'మన్న మిత్రుల ప్రోద్బలంతో అటు తెలుగూ ఇటు ఇంగ్లీష్ ఏదీ సరిగా రాని నేను మొదలుపెట్టానీ పుస్తకాన్ని.

"నేను పోయేలోపు నీ పుస్తకం వస్తుందా నాయనా ?"  అని అడిగేవారు హైమావతిగారు. మీరు వెళ్ళిపోయారు. "ఏదీ నీ పుస్తకం ?" అంటూ దబాయించారు యోగానంద గారు రెణ్ణెల్ల క్రిందట. చివరికి ఈ పుస్తకం.

తాత్విక విషయాల్ని వెల్లడించడానికి అప్పటికే ఉన్న ఆధ్యాత్మిక పరిభాషని కాక సాధారణ పదాలతోనే స్వంత శైలిని ఇంగ్లీషులో సృష్టించుకున్నారు యూజీ. ఆయన మాటల్ని తెలుగు చేసేప్పుడు సందర్భ పరిచయం లేకుండా, ముందు వెనుకలు లేకుండా ఆ భావాల్ని తీసుకురావడం కష్టమయ్యింది. అలా చేయడంలో కొన్ని చోట్ల సఫలమయ్యాను. మరి కొన్ని చోట్ల విఫలమయ్యి ఉండవచ్చు.

వొళ్ళో కూచోబెట్టుకుని బలపంతో అక్షరాల్ని దిద్దించినట్లు నాచే ఈ ప్రయత్నాన్ని చేయించిన శ్రీ వావిలాల సుబ్బారావు గారికి, శ్రీ హనుమంత రెడ్డి గారికి, శ్రీ చంద్రశేఖర్ గారికి కృతజ్ఞతలు.

అక్టోబర్ 2012 **రాజశేఖర్ పాలడుగు**

# ముందు మాట

చాలా సంవత్సరాల క్రితం, ఓ విధినిర్ణీతమైన రాత్రి తమిళనాడులోని ఎర్కాడులో, ఓ బ్రిటిష్ కాలపు ఇంటిలో మిత్రుడు చంద్రశేఖర్ కలల్ని యూజీ కృష్ణమూర్తి భోగిమంట వేశారు. వీడియో రికార్డింగ్‌లను విసిరి కొట్టారు. ఎన్నో సంవత్సరాల నుండి స్నేహితులు ఆయనకు వ్రాసిన ఆత్మీయ ఉత్తరాల కట్టలనూ, వందలకొద్దీ తన అరుదయిన ఫోటోలనూ మంటల్లో కుక్కారు. యూజీకి సంబంధించిన వాటిని భద్రపరచాలని చంద్రశేఖర్ ఎన్నో సంవత్సరాల తరబడి వీటిని చాలా కష్టపడి సేకరించారు. చారిత్రాత్మక ప్రాధాన్యత కలిగిన ఈ వస్తువులు ఓ జ్వాల క్రింద అయిపోతే, అంతకు చాలాకాలం ముందు ముంబయ్‌లో ఓ అయిదు నక్షత్రాల హోటల్‌లో కాఫీ తాగుతున్నప్పుడు యూజీ నాతో అన్నది జ్ఞప్తికి వచ్చింది. "నేను చనిపోయాక, నాకు సంబంధించినదేదీ మీ లోపల కాని, బయట కాని, ఉండడానికి వీల్లేదు. నేను బ్రతికుండగా ఎలాంటి సంస్థలూ లేక స్థాపనలూ నా చుట్టూ తలెత్తకుండా చూడడానికి తప్పకుండా నేను చాలా చేస్తాను. కాని నన్ను మీ మెదళ్ళలో ప్రతిష్ఠించుకోవడాన్ని నేనెలా ఆపగలను?" అని. రగిలే రుషిగా ఎంతోమంది పేర్కొనే యూజీ యొక్క ఈ దయలేని చర్య, అతడు తన మాటను ఖచ్చితంగా నిలబెట్టుకోవడాన్ని ప్రదర్శింపచేసింది. ఏమి మాట్లాడతామో దానికి పూర్తి విరుద్ధంగా చేసే మనలో చాలామందిలా కాకుండా, మాట్లాడే తోవలో నడిచే మనిషున్నాడిక్కడ. కాలపు ఇసుకతిన్నెల నుంచి ఆయన తన పాద ముద్రల్ని చెరుపుతున్నారు.

కాని వాస్తవమేమిటంటే అలా చేయడంలో ఆయన విఫలమయ్యారు. యూజీ మన హృదయాల్లో ప్రతిష్ఠించబడి ఉండి, మనం పోయే వరకూ అక్కడే కొనసాగుతారనే ఖండించరాని వాస్తవానికి ఈ పుస్తకమే సాక్ష్యం.

మనం తనని మరచిపోవాలని యూజీ ఎందుకనుకుంటారనే ప్రశ్న నాకు నేను వేసుకుని ఆశ్చర్యపడ్డాను. దానికి సమాధానం కొన్ని సంవత్సరాల తరువాత టీచర్స్ డే రోజున ఆయన్ని అభినందించడానికని నేను ఫోన్ చేసినప్పుడు తెలిసింది. "మానవాళికి ఈ టీచర్స్ డే రోజున మీ సందేశం ఏమిటి యూజీ" అని అడిగాను. నా జీవితంలో ఎన్నో ముఖ్యమైన పాఠాలను నేర్చుకున్న వ్యక్తి నుంచి చాలా తలక్రిందులు సమాధానాన్ని ఊహించి నన్ను నేను

సిద్ధపరచుకున్నాను. కొద్దిసేపు ఫోన్‌లో నిశ్శబ్దం ప్రతిధ్వనించింది. అది న్యూయార్క్‌లో అర్ధరాత్రి. యూజీని పక్కమీద నుంచి నా ఫోన్ కాల్‌తో బయటకు లాగాను.

"గురువులందర్నీ నాశనం చేయాలి" అని ఆయన తీర్మానించారు. "ఈ రోజున ప్రపంచంలో మీరందరూ ఉన్న గందరగోళానికి బాధ్యత వాళ్ళదే. నిన్ను నీ స్వంత సంభావ్యతా శక్తిని స్పర్శించకుండా అడ్డుపడేది గురువే. అందుకే నేను అన్ని నమూనాలనూ బద్దలుకొట్టాల్సిన అవసరముందంటాను. జీవితం అనుసరించదు. మీరు అనుసరిస్తారు. నీవు ఓ నమూనాని ఉపయోగిస్తున్నంతకాలం, ఓ గురువు ననుసరిస్తున్నంతకాలం నీవో ఎంగిలి మనిషిగానే ఉండిపోతావు. ఒంటరిగా నడిచే ధైర్యాన్ని నీవు తప్పనిసరిగా కలిగి ఉండాలి. నేను ఓ గురువును కాదు. ఎప్పుడూ అలా ఉండలేదు కూడా! కాని ఈ ప్రవక్తలు ప్రపంచంలో ఎన్ని చిక్కులు వదలివెళ్ళారో నీకు కనిపించడంలేదా? వాళ్ళు లేకుంటే, ఈ ప్రపంచం ఇంకా ఉత్తమ ప్రదేశంగా ఉండి ఉండేది" – అన్నారు యూజీ. "అవును యూజీ" అంటూ నేను గుసగుసలాడాను. "కృతజ్ఞతలు ఇంక ఉంటాను" అన్న నా మాటకు నవ్వి ఫోన్ పెట్టేశారాయన. ఆయన మాటలు నాపై ఎంత చెదరగొట్టే ప్రభావం చూపుతాయో ఆయనకు తెలుసు.

కాని వాస్తవమేమిటంటే, నేను చెదిరిపోయిన ప్రతిసారీ ఓ రకంగా మళ్ళీ జన్మించాను. భగవంతుడు, జీవితం, ప్రేమ, సృజనాత్మకత, మరణం మొదలైన వాటిగురించి నేను ఆయనతో చేసిన తీవ్ర యుద్ధాలు ఈ రోజు నేనిలా ఉండడాన్ని రూపుదిద్దుకునేలా చేశాయి. ఆయన మాటలు నా నిధుల పెట్టె. దాని నుండి కొన్ని రత్నాలను తీసి వాటిని ప్రపంచంతో పంచుకుంటాను. అలా చేయడమే నన్ను సజీవంగా ఉంచుతుంది. ఈ పుస్తకం అలా చేయడం నన్ను సంతోషపెడుతుంది.

ఫిబ్రవరి 2009

**మహేష్ భట్**

(ప్రముఖ హిందీ సినిమా దర్శకులు)

# యూజీ కృష్ణమూర్తి జీవితం – బోధనల సంక్షిప్త చిత్రణ

“నేను మానవాళి రక్షకుడిని కాదు. నేనీ మత వ్యాపారంలో లేను. కేవలం దీన్ని (సహజ స్థితిని) వర్ణించడంపైన మాత్రమే నాకాసక్తి. మత వ్యాపారులు ఈ మొత్తంపై కప్పిన అతీంద్రియత, మార్మికతల్ని తొలగించడాలపైననే నాకాసక్తి. మీ ఊహల్లో తప్ప, ఉనికే లేని స్థితి కోసం మీరు చాలా శక్తినీ, కాలాన్నీ వృథా చేసుకోవద్దని మిమ్మల్ని నేను ఒప్పించగలననుకుంటా” – యూజీ కృష్ణమూర్తి.

1967, ఆగస్ట్ నెలలో ఓ రోజున పారిస్‌లో యూజీ స్నేహితులతో కలసి ఓ నృత్య ప్రదర్శన చూడ్డానికి ‘కెసినో డి పారిస్’ కు వెళ్ళారు. అక్కడ హఠాత్తుగా అపరిచితమైనదేదో తనకు జరుగుతున్నట్లనిపించిదాయనకు. తన లోపల ఓ ప్రత్యేక కదలికను ఆయన ఫీల్ అయ్యి, స్టేజ్ మీద నృత్యం చేస్తున్నది డాన్సరా లేక స్టేజ్‌కు దూరంగా కూర్చున్న తానా అన్నది తేల్చుకోలేకపోయారు. ఇద్దరి మధ్యా విభజన లేనట్లుంది. దీనితో మార్మిక చరిత్రలో మీరెన్నడూ చదువని అత్యంత ఆశ్చర్యకరమైన, అవగాహన కాని మార్మిక అనుభవాలకు బీజం పడింది. చాలామంది మార్మికులు మాట్లాడినట్లు అవి పరమ సుఖానుభవాలు కావు. ఆ చైతన్య శక్తి విస్ఫోటనం వల్ల యూజీ దేహంలో మొదలయినది దాదాపుగా ఓ భౌతిక చిత్రహింస. అదే ‘చైతన్య శక్తి’ తరువాత ఆయన్ని, ‘సహజ స్థితి’ అని యూజీ పిలిచే స్థితిలో ఉంచింది.

యూజీ దేహం ఓ అద్భుతమయిన మార్పుకు గురవ్వడం మొదలుపెట్టింది. తరువాత మూడు సంవత్సరాల కాలంలో తనదైన స్వంత లయలో పడింది. శరీర రసాయనతత్వంతో పాటు అయిదు ఇంద్రియాలూ రూపాంతర పరిణామం చెందాయి. కళ్ళు రెప్పలార్చడం మానేశాయి. చర్మం అత్యంత మృదువయ్యింది. దేహంలో ఏ భాగాన్ని రుద్దినా బూడిదవంటి పదార్థమొచ్చేది. ఎడమవైపు వక్షం పెరిగింది. అన్నింటిలోనూ బాగా గమనించదగ్గ మార్పేమంటే, ఇంద్రియాలన్నీ అంతకు ముందెరుగని అత్యున్నత సున్నితత్వంతో వ్యవహరించడం మొదలుపెట్టాయి. బాల్యం నుండి యవ్వనం వరకూ చేతనంగా ఉండి, ఆ తరువాత నిద్రాణమై ఉండే థైమస్ (Thymus) గ్రంథి తిరిగి చేతనమయ్యింది.

అంతేకాక, యూజీకి బుద్ధుడు, జీసస్, మహావీర, మొహమ్మద్, సోక్రటీస్, జుత్తు విరబోసుకుని నగ్నంగా ఉన్న కొందరు యోగినులు, హిందువుల దైవమయిన నరసింహావతారం, సగం మనిషి – సగం సీల్ దేహంతో ఉన్న గ్రీకుల దైవం – వీరందరి దర్శనాలయ్యాయి. చివరికి అవన్నీ,

ఆయన చైతన్యం నుండి కడిగివేయబడ్డాయి. ఆఖరికి ఈ పవిత్ర రూపాలన్నీ కూడా ఆ సహజ స్థితిలో కళంకాలే కనుక అవన్నీ పోవాలి. అదో భయంకర ప్రయాణం. ఆలోచన తాకని అనాది చైతన్య స్థితిలోనికి పెద్ద గంతు. అది ఓ నవీన మానవుని జననం.

1918 లో కృష్ణా జిల్లా, మచిలీపట్నంలో ఓ ఎగువ మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి, గుడివాడలో తాతగారిచే మత వాతావరణంలో పెంచబడ్డారు యూజీ. పవిత్ర గ్రంథాల నుండి సూత్రాలను వల్లెవేయడం నేర్చుకున్నారు. ఆ ప్రాంతాన్ని సందర్శించిన ఎంతోమంది పవిత్ర వ్యక్తులనబడే వాళ్ళను కలుసుకున్న యూజీ, వారిలో చాలామందిని మోసగాళ్ళుగా గుర్తించారు. ఆయన ధ్యానాన్ని, యోగాన్ని సాధన చేశారు. ఎన్నో శాస్త్రాల్ని అభ్యసించారు. చాలా చిన్న వయసులోనే (14 నుండి 21 సంవత్సరాల లోపు) ఎన్నో మతానుభవాల్లోంచి నడిచారు. అయినా అసంతృప్తిగానే ఉన్నారు. మోక్షానికి, స్వాతంత్ర్యానికి తక్కువ కానిదాన్ని ఆశించారు యూజీ. ఇరవై ఒక్క సంవత్సరాల వయస్సులో తిరువణ్ణామలై వెళ్ళి, రమణ మహర్షిని కలసి "మీకున్నదేదో అది నాకియ్యగలరా?" అని అడిగారు. "ఇస్తాను, కాని నీవు తీసుకోగలవా?" అనే ఎదురు ప్రశ్న వచ్చిందాయన్నించి. తనకు లేనిది రమణ మహర్షికున్న దేమిటా అని ఆ యువ అన్వేషి ఆశ్చర్యపడుతూ బయటకు వచ్చాడు. అదేదో తనకోసం తనకు తాను కనుక్కోవాల్సిఉంది. ఆయన గురువుల చుట్టూ తిరగడం మానేసి తన్ను తాను పరిశీలించుకోవడం మొదలుపెట్టారు.

మద్రాసు విశ్వవిద్యాలయంలో చేరి తత్వం మరియు మానసిక శాస్త్రాలను అభ్యసించారు. కాని ఆయనలోని లోతైన ప్రశ్నలకు అవి సమాధానాలీయలేకపోయాయి. యూజీ ఓ రోజున తన ఆచార్యుని ఇలా ప్రశ్నించారు. "మనం ఎప్పుడూ మనసు గురించే మాట్లాడుకుంటున్నాం. ఫ్రాయిడ్, జంగ్, ఆడ్లెర్ ఇంకా ఇలాంటివాళ్ళందరి పుస్తకాలను ఎన్నో చదువుతున్నాం. కాని మీ స్వంతంగా మనసు గురించి ఏమైనా తెలుసుకున్నారా?" అని. అది ఓ ఇబ్బందికరమైన ప్రశ్న మాత్రమే కాదు ప్రమాదకరమైనది కూడా. కేవలం ఆచరణాత్మక దృక్పధం ఉన్న ఆ ఆచార్యుడు యూజీని అలాంటి ప్రశ్నలడగడం మానేసి ఊరకే పాఠాల్ని వ్రాసుకుని, వల్లె వేసుకుని పరీక్షల్లో వాటిని వ్రాయమని సలహా ఇచ్చాడు. విద్యార్థికా సలహా నచ్చక ఆ చదువు వదిలేశాడు.

తరువాత వివాహం. ఆయన భార్యకు ఆంగ్లంలోనూ, సంస్కృతంలోనూ డిగ్రీలున్నాయి. చాలామందిలానే ఆయనా ఓ పురుషాధిక్య భర్త. వాళ్ళకు నలుగురు సంతానం. అప్పటికి యూజీ, అనీబిసెంట్ మరియు సి. డబ్ల్యూ. లెడ్‌బీటర్‌లచే నడుపబడుతున్న దివ్య జ్ఞాన సమాజంలో చేరారు. '20వ శతాబ్దపు ప్రవక్త"గా అనీబిసెంట్‌తో బహిరంగంగా ప్రకటింపబడిన జిడ్డు

కృష్ణమూర్తి సాన్నిహిత్యంలోకి వచ్చారు యూజీ. అప్పటి నుండి ప్రపంచం అంతా తిరుగుతూ తన మనసు దానిలో లేకున్నా దివ్య జ్ఞానం గురించి ఉపన్యాసాలిచ్చారు.

అప్పుడు అనివార్యమైనది జరిగింది. 1961 లో వివాహం విచ్ఛిన్నమయ్యింది. దివ్య జ్ఞాన సమాజం నుండి బయటపడ్డారు. జేకే (జిడ్డు కృష్ణమూర్తి)ని వదిలేశారు. మూడు సంవత్సరాలపాటు లండన్‌లో తల లేని మనిషిగా, గాలికి ఎగిరే ఎండుటాకులా పిచ్చి తిరుగుడు తిరిగారు. ఈ సుదీర్ఘ "ఆత్మ యొక్క చీకటి రాత్రి" ముగిసి ఉపనిషత్తులు చెప్పే పరమానంద స్థితిలోనో లేక హృదయ వైశాల్యంలోనో ఉదయించక ఓ విపత్తులో, ఓ మతాతీత జీవ పరివర్తనలో ఉదయించింది.

యూజీ అనుభవాలు లేక ఆయన సహజ స్థితి అని పిలిచేది, ఇంకా ఆయన బోధనలు ప్రపంచమంతటా ఉన్న మత సంప్రదాయాలకు గొప్ప సవాలుగా నిలచాయి. వాస్తవానికి యూజీ మాట్లాడిన దానిలో బోధన లేదు. బోధన అంటే, మన జీవన విధానంలో పరిపూర్ణ మార్పుకై అనుసరించాల్సిన ఓ పద్ధతి, ఓ వ్యవస్థ లేదా ఓ సాంకేతికతని సూచించేది. తాను మాట్లాడేది బోధనారంగం బయటిదని యూజీ నొక్కి చెప్పారు. వాస్తవ దృష్టిలో చూస్తే అసలు గురువు లేడు, ఉపదేశింపబడేదీ లేదు కనుక బోధన అనేది లేదు. ఆయన మాటల్లో ప్రతీకత (దేన్నో దాన్ని సూచించే పద్ధతి) లేదు, ఆధిభౌతికత లేదు, మార్మికత లేదు. ఆయనేమి మాట్లాడారో దాని అర్థం అదే. యూజీ భాషలో కొత్తదనమేమీ లేదు. తత్వవేత్తలు, శాస్త్రవేత్తల్లా ఆయన కొత్త పదాల్ని సృష్టించలేదు. జీవితాన్ని స్వచ్ఛమైన, సరళమైన, భౌతిక, దైహికమైనదిగా వర్ణించడానికి ఆయన ఆధిభౌతిక ఉచ్ఛస్వరాలు, ఆధ్యాత్మిక విషయాలు లేని సామాన్య వాడుక పదాల్ని ఉపయోగించారు. తద్వారా జీవితం అమానసికం, అమార్మికంగా అయ్యి, చివరికి దాన్నుండి గొప్ప విప్లవాత్మకమయినది వచ్చింది.

సాధారణంగా, ప్రపంచ వ్యాప్తంగా ప్రజలతో ఆయన జరిపిన స్వేచ్ఛాపూరిత సంభాషణలతో ఆయన రెండు పనులు చేశారు.

మొదటిది, తాను, తన దేహం, భౌతికంగా, దైహికంగా వ్యవహరిస్తున్న తీరును వర్ణించడం. దాన్ని ఆయన 'సహజ స్థితి'గా పిలిచారు. సమస్త కోరికలు, భయాలు ఇంకా భగవంతుడు, సత్యం, సంతోషం, సుఖాలకైన అన్వేషణలు ముగింపుకు వచ్చిన 'ప్రాచీనత లేని ఆది ఎరుక' లేదా 'విభజన లేని చైతన్య స్థితి' అది. అది భగవంతుడిని ఎరిగిన స్థితో లేక జ్ఞానోదయ స్థితో కాదని ఆయన నొక్కి చెప్పారు. అది పరమానంద స్థితి కాదు, అత్యున్నత సంతోష స్థితీ కాదు. అక్కడ కేవలం జీవం యొక్క నాడి, లయబద్ధత, ఘాతం మాత్రమే ఉంటుంది. అక్కడ ఏర్పడిన పరిస్థితులబట్టి గాని, ఎవరినుంచయినా వచ్చిన ఓ ప్రశ్నకు ప్రతిస్పందనగా గాని ఆలోచనలు తలెత్తి వాటంతట అవే మండిపోయి శక్తిని

విడుదల చేస్తాయి. అక్కడ ఆత్మ లేదు. ఉన్నది దేహం మాత్రమే. ఆ దేహం అమరమయినది. అది తెలివిడి లేని, అకారణ విస్మయ స్థితి. "ఇలా నీవు ..... ఆలోచన యొక్క యాంత్రికత నుండి బయటపడి కూడా వ్యవహరిస్తుంటావు" అని యూజీ నొక్కి చెప్పారు.

రెండవది, మనం ఎలా వ్యవహరిస్తున్నామో ఆయన వర్ణించారు. ఉనికే లేని దేవుళ్ళు, లక్ష్యాలకై అన్వేషణలో, మనం ఎలా ఉన్నామో అలా కాక, ఇంకెలాగో మారడానికి నిరంతరం ఘర్షిస్తూ, పరస్పర వ్యతిరిక్తాల ప్రపంచంలో ఎలా ఇరుక్కుపోయామో చెప్పారు. ఎలా మనందరం ఒకే వాతావరణాన్నీ, ఊపిరినీ పంచుకుంటామో, అలానే అందరం ఒకే "ఆలోచనాగోళం"లో ఆలోచించి వ్యవహరిస్తాము. ఎందుకు, ఎలాగ మనకు క్రియా స్వేచ్ఛ లేదంటే ఆలోచన ముగిసే వరకూ, ముగింపుకు వచ్చే వరకూ స్వేచ్ఛ ఉండదు – కాని, ఆలోచన తన్ను తాను అంతమొందించుకోవాలనుకోదు. ఆలోచన స్వీయ రక్షణతో కూడిన నియంత స్వభావాన్ని కలిగి ఉంటుంది. తన స్వంత మనుగడకోసం, తనకు తాను ఉరవడి నిచ్చుకోవడంకోసం అది అందుబాటులో ఉన్న ప్రతి యుక్తినీ ఉపయోగిస్తుంది. ఆలోచన మన భావాల్ని, కార్యాల్ని నియంత్రించి, మలచి రూపుదిద్దుతోంది. భావన మరియు చర్య – రెండూ ఒకేలాంటివి, ఒక్కటే కూడాను. మన కార్యాలన్నీ భావనల నుండి జన్మించినవే. మన భావనలన్నీ ఓ తరం నుండి మరో తరానికి అందించబడిన ఆలోచనలే! మన చుట్టూ ఉన్న జీవంతో సామరస్యంగా జీవించడానికి, సహాయపడడానికి ఈ మనసు ఓ పనిముట్టు కాలేదు. అందువల్లనే ఈ జీవావరణ సమస్యల్నీ, ఈ కాలుష్య సమస్యల్నీ, మనల్ని సర్వనాశనం చేయగల అత్యంత విధ్వంసక ఆయుధాల్ని సృష్టించుకున్నాము.

యూజీ తన ఎనభై తొమ్మిదో ఏట, 2007 మార్చి 22 న ఇటలీలోని వాలెక్రోసియాలో, ఓ స్నేహితుని భవంతిలో అస్తమించారు. యూజీ ఎన్నడూ మరణించడం గురించి ఎలాంటి భయమూ, పట్టింపూ కనపర్చలేదు. "జీవం, మరణం వేరు చేయబడనివి. మీరు దేన్ని మరణమనుకుంటారో అది చోటు చేసుకున్నప్పుడు, దేహం తనకు తాను, దాని మూల ధాతువుల క్రింద విడిపోయి జీవం కొనసాగడానికి ఆధారాన్ని సమకూరుస్తుంది. అలా చూస్తే దేహానికి మరణం లేనట్లే" అని యూజీ అంటుండేవారు. తన అభిమాన సమూహాలపై ఇప్పటివరకూ ఆయన కలిగించిన, ఇంకా కలిగించబోతున్న ప్రభావాన్ని మాటల్లోనికి తీసుకురావడం చాలా కష్టం.

జారుతున్న వెండి జుత్తుతో, లోతైన నేత్రాలతో, బుద్ధుని వంటి పొడవైన కర్ణాలతో ఉన్న ఆయనది ఓ విస్ఫోటకపు సమక్షం, అయినా నిర్మలమయినదే.

ఫిబ్రవరి 2009 ముకుందరావు

# తాత్విక చింతనలో నూతన ధోరణి

**(సెప్టెంబర్ 6, 1993న ఆలిండియా రేడియో, హైదరాబాద్ నించి 'స్రవంతి' కార్యక్రమంలో ప్రసారమైన ప్రసంగం)**

యూజీ కృష్ణమూర్తి అవతారపురుషులు కారు. మహాత్ములు కారు. గురువు కాదు. యోగి కాదు. ప్రవక్త కాదు. ఏదో మానసిక పరివర్తన కలిగిన వ్యక్తి కాదు. ఇట్లా చెబుతూ పోతే యీ జాబితా ఎడతెగకుండా, వేదాంతులు పరబ్రహ్మాని 'ఇది కాదు–ఇది కాదు, నేతి–నేతి', అంటో చెప్పాలని చూసే ధోరణిలో పడే ప్రమాదం వుంది. ఇంతకీ ఎవరాయన? అంటే, సరైన–సూటైన పదం కోసం వెతికి, విసిగిపోయి, 'ఒక తరహా తత్త్వవేత్త' అని చెప్పాల్సి వొస్తుంది. గత అరవై ఏళ్ళుగా నిలకడ లేకుండా దేశ విదేశాటనం చేస్తూ వొస్తున్నారు గనుక, 'లోకసంచారి' అన్నపదం అతికినట్టు సరిపోతుందేమో! ప్రపంచంలో యూజీగారు... యూజీ కృష్ణమూర్తిగారు.... 'యూజీ' అనే పొడి అక్షరాలతోనే లోకప్రసిద్ధులు. వీరు దర్శించని దేశం లేదు. అమెరికా, ఆస్ట్రేలియా, యూరోపు ఖండాలే కాక రష్యా, చైనా దేశాలు కూడా తిరిగారు వారు.

ఆంధ్ర ప్రదేశాన్ని ఇరవై ఏళ్ళు తన రచనా ప్రభంజనంతో అదరగొట్టిన గుడిపాటి వెంకటచలం – ముచ్చటగా 'చలం' – పేరు విననివాడు అరుదు. తన స్వీయచరిత్ర 'చలం' పుస్తకం చివర్లో 'యూజీ క్షమించండి!' అంటో తన కథని ముక్తసరిగా ముగిస్తాడు. ఉపోద్ఘాతాల్లేకుండా పేర్లు ప్రవేశపెట్టే చలం ధోరణికి అలవాటుపడ్డవారు కూడా 'ఎవరు చెప్మా యీ యూజీ?' అనీ తలలు గోక్కొని వుంటారు. చలమంతటివాడు తన కథ రాసుకుంటో చివర్ని ఎవరో యూజీని క్షమించమనడంలో అంతరార్థమేమిటి? నా ప్రశ్నకి సమాధానంగా చలం చెప్పారు : "....... పురుషుడి మీద స్త్రీ ఆలంబనం పోతేనే గాని స్త్రీకి మోక్షం లేదు. పురుషుడికీ లేదు". అని రాశాక చప్పున తట్టింది నాకు, 'యూజీ అసలు మోక్షమే లేదంటోంటే నేనేదో మోక్షం వుందని రాస్తున్నానే' అని. దానికి, 'క్షమించండి యూజీ' అన్నాను." చలం జీవితం చివరి దశాబ్దంలో యూజీ ప్రభావం ఆయనపై ఎంత గాఢమో చెప్పాలంటే మాటలు చాలవు.

చలం మల్లేనే యూజీ వల్ల ప్రభావితుడైన మరో కవిమిత్రుడు, వజీర్ రహ్మాన్. తెలుగువారికి రహ్మాన్ అందించిన చివరి కాన్క – 'సాహసి' అనే కవితా సంకలనంలో యూజీని గుర్తుతెచ్చుకొంటో రాస్తారు. "...... యూజీ ఆలోచనాపద్ధతి జిడ్డు కృష్ణమూర్తిగారి కోవకి చెందినట్టు కనబడ్తుంది. కాని, కాదు. అసలు మొత్తం తాత్విక కట్టడాలని ఏమాత్రం రాజీపడకండా సమూలంగా ధ్వంసం చేస్తారు యూజీ. సాధనా పద్ధతుల్ని, వాటి ఆవశ్యకతనీ

పూర్తిగా నిరాకరించడమే కాదు, అసలు సాధించడానికేమీ లేదంటారు."

పదిహేడేళ్ళ క్రితం వజీర్ నా ఉత్తరం అందగానే, యూజీని కలవడానికి బెంగుళూరు వొచ్చారు. ఆ రోజు – ఆ డిశంబరు ఉదయం – వజీర్, యూజీల మధ్య జరిగిన సంభాషణ నాకిప్పటికీ గుర్తు.

'యూజీ, చచ్చింతరవాత ఏమవుతాం?' వజీర్ సూటైన ప్రశ్న.

'కాలిస్తే బూడిదవుతాం. పాతితే కలిసిపోతాం. సముద్రంలో పారేస్తే జలచరాలకి ఆహారమవుతాం. అంతే.' యూజీ సమాధానం. తెల్లబోయాడు వజీర్.

'దేహం గురించి కాదు నేనడగడం....'

'దేహం కాక వేరే ఏముందనుకుంటున్నారు?' యూజీ ఎదురు ప్రశ్న.

'జీవమనేది వుందికద, అదేగా మనకీ, జడపదార్థాలకీ తేడా?'

యూజీ చిరునవ్వు నవ్వారు. 'జీవముందికద అంటున్నారు. మీకెట్లా తెలుస్తోంది? జీవిస్తున్నాననే అనుభూతి ఎట్లా సాధ్యం?'

'నేనున్నాననే స్పృహ నాకు స్పష్టం.' అన్నారు వజీర్.

'ఈ స్పృహలూ, సంవేదనలూ, అనుభూతులూ.... ఇవన్నీ యోచనకే మారుపేర్లు. ఆలోచన ద్వారా తప్ప ఏ వొక్కటీ అనుభవానికీ రాదు. అనుభవానికి ఏది రావాలన్నా దాని గురించిన జ్ఞానం ముందే వుండి తీరాలి'. అన్నారు యూజీ.

వజీర్ వొక్క క్షణం ఆలోచిస్తూ వుండిపోయారు. 'ఐతే, నేనున్నాననే స్పృహ వుత్తయోచనే అనుకున్నా, చచ్చిన తర్వాత దాని గతి ఏమవుతుంది?' అని అడిగారు చివరికి.

'యోచనలనేవి మీ స్వంతం కావు. విద్యుదయస్కాంత తరంగాలమల్లే సర్వత్రా నిండివుంటాయవి. ఒక రేడియో సెట్టు పాడైతే ఆ తరంగాలకేం నష్టం?'

'ఐతే, చివరికేం మిగుల్తుంది?' వజీర్ గొంతులో సన్నగా వణుకు.

'ఏం మిగలదు. అసలు యిప్పుడేముంది గనక, చివరికేదో మిగలడానికి? మీలో యిప్పుడేముందో చెప్పండి.' అన్నారు యూజీ. మౌనంగా, సాలోచనగా చూస్తూ వుండిపోయారు వజీర్. ఆ శీతాకాలం వుదయపు చలిలో వారి నుదుటి మీద చిరుచెమట్లు.

ఆ తర్వాత ఒకసారి యూజీతో అన్నా నేను : "మీ మాటలు వజీర్ మనసులో చాలా గాఢంగా పడ్డాయిలా వున్నాయి. ఆయన ధోరణి గమనిస్తే,

పూర్వం మీరు రమణమహర్షిని చూసి 'మీలో వున్నదేదో నా కివ్వగలరా?' అంటో అడిగినట్లుంది."

కాదన్నారు యూజీ. 'అప్పటి నా మనోస్థితి వేరు. నాలో అప్పటికే ఆధ్యాత్మిక జీవనం, సాధనలు, గురువులు, వారి బోధలు – వాటన్నిటిమీదా పట్టుపోయింది. భ్రమలన్నీ మండిపోయాయి. నిజానికి వొక మిత్రుడి బలవంతం మీద అయిష్టంగా, అనుమానంగా, తటపటాయిస్తూ వెళ్ళాను రమణమహర్షిని చూడ్డానికి. అప్పటికి నా వయస్సు ఇరవై నొకటి.'

'ఆయన్ని చూడగానే మీకేమనిపించింది?' అడిగాను.

"మీరనుకొనే వుదాత్త భావాలేవీ రాలేదు. 'ఈ గోచిపాతరాయుడు నాకేం సహాయం చేయగలడు?' అనిపించింది ముందు. కాని, నాలో లేనిదేదో ఆయనలో వుందనిపించి – 'మీలో వున్నదేదో నాకిస్తారా?' అని అడిగాను. ఆయన మొదట వినిపించుకోకపోయినా రెట్టించాను. 'ఇస్తాను. ఐతే, నువ్వు తీసుకోగలవా?' అని ఆయన ఎదురు ప్రశ్నించేప్పటికి 'షాక్' అయ్యాను. 'ఎంత తల బిరుసు! నన్ను 'తీసుకోగలవా' అని అడగడమా? అనిపించింది. అసలెవడికన్నా ఆ అర్హత వుంటే అది నా వొక్కడికే నన్న ధీమా నాకప్పుడు. 'ఎన్ని సాధనలు చేసాను. ఎన్ని ఉన్నత ఆధ్యాత్మిక స్థితులు సాధించాను. ఎంత తపించాను. నేను తీసుకోలేనని అనుకుంటున్నాడంటే ఆయనలో వున్నదేమిటి?' అన్న ప్రశ్న నాటుకుంది నాలో. తర్వాత ఆ ప్రశ్నే కాస్త మారింది. 'రమణలో గాని, బుద్ధుడిలో గాని, ఏసులో గాని వుండిందేమిటో నా కెందుకు? అసలు వీళ్ళంతా చెప్పే 'మోక్ష'మనేది వుందా? ఏమిటా మోక్షస్థితి?' అన్న ప్రశ్న రగుల్కుంది."

యూజీలో అప్పట్నించి 'మోక్షస్థితి ఏమిటి?' అన్న జిజ్ఞాస తప్ప ఆ స్థితి సాధించుకోవాలనే ఆరాటం పోయింది. క్రమేణా ఆ ప్రశ్న 'ఇంతింతై వటుడింతింతై....' అన్న రీతిగా తీవ్రమౌతో ఆయన జీవితాన్నంతా ఆక్రమించి మారణహోమం చేసింది. చివరికి ఆ హోమంలో – ఆయన యూనివర్సిటీ చదువు, సంసారం, ఆస్తిపాస్తులు, జిడ్డు కృష్ణమూర్తితో స్నేహం, దివ్యజ్ఞాన సమాజంలో కీర్తి ప్రతిష్టలు, మేటి వక్తగా గుర్తింపు – సమస్తమూ సమిధలమల్లే భగ్గుమని మండి లండన్ వీధుల్లో బికారిగా మిగిలారు యూజీ.

అటువంటి నిస్సహాయ పరిస్థితిలో 'వాలంటైన్ డి కెర్వెన్' అనే స్విస్ మహిళ సహజ సహానుభూతితో అర్థం చేసుకుని యూజీకి అండగా నిలబడి వారి రక్షణ భారం సంతోషంగా స్వీకరించగానే వారి జీవితం సరికొత్త మలుపు తిరిగింది. స్విట్జర్లాండు 'ఆల్ప్స్' కొండల్లో 'సానెన్' అనే గ్రామంలో యూజీకి వసతి

కల్పించింది వాలంటైన్. ఆనాటి నించి నేటికీ అదే వారి ముఖ్య నివాసం. తర్వాత కొన్నేళ్ళకి 1967వ సంవత్సరం జూలై 9న, యూజీ వో చెట్టు కింద కూచున్నారు. ఎదురుగ్గా ఏడు కొండలు – ఏడు లోయల విస్తారమైన దృశ్యం. సానెన్ ప్రపంచంలోనే అతి రమణీయ ప్రదేశాల్లో ముఖ్యమైంది. యూజీ మనసులో ప్రచండ వేగంతో సుడులు తిరుగుతో అదే ప్రశ్న : 'మోక్షస్థితి ఏమిటి?' అన్న ప్రశ్న. అంతకంతకూ అది తీవ్రమౌతో అయన ఉనికి పూర్తిగా ఆ ప్రశ్నే ఐపోయింది. హఠాత్తుగా ఆ ప్రశ్న అంతర్ధానం. ఐతే, అదేదో సమాధానం దొరికినట్టు కాదు. తక్షణం వారి దేహంలో పెద్ద అణుబాంబు పేలుడులాటి స్ఫోటన. అణువణువూ, నరనరమూ పేలిపోతున్నట్టు. మెదడంతా గడ్డకట్టి బుర్ర బిగుసుకుపోయినట్టు. దేహం నిర్జీవమై అక్షరాలా మరణించిన యూజీ నలభై ఐదు నిమిషాల అనంతరం తామిప్పుడు చెప్పే 'సహజస్థితి'లో మేలుకున్నారు. ఆరోజు సరిగ్గా వారి నలభై తొమ్మిదవ పుట్టినరోజు. ఆరోజున 'జ్ఞానోదయం' సిద్ధిస్తుందని వారి చిన్నప్పుడు పలికిన కౌమారనాడి జోస్యం ఆ విధంగా ఫలించింది.

"ఆ క్షణం నించి 'నేను' లేను. అప్పుడు పోయిన దేహస్మృతి మళ్ళీ రాలేదు. ఈ 'స్థితి' ఆధ్యాత్మికం కాదు. ఆముష్మికం అంతకన్నా కాదు. దేహేంద్రియాలు పరస్పర సంబంధం లేకుండా, వేటికవే స్వతంత్రంగా మసులుతో దేహమనే ఈ యంత్రాన్ని అతి చాకచక్యంగా నడుపుతున్న గమ్మత్తు యిది. దేహంలో అణువణువునా సంభవించే తిరుగులేని జైవిక, రసాయనిక మార్పు. నా కథ అక్కడితో సమాప్తం." అంటారు యూజీ.

వారి దేహంలో, వినాళగ్రంధుల స్థానాల్లో చిత్రవిచిత్రమైన ఆకారాల్లో చర్మంపైకి రంగులు పొంగి యోగనాడీ చక్రాలమల్లే భ్రాంతి కలిగించేవి చూసేవారికి. వారి వక్షంలో కుడివైపు పురుష రూపం వుంటోనే, ఎడమవైపు నరనారీ సంయోగానికి పరాకాష్టగా ఎడమ వక్షం స్త్రీరూపం దాల్చింది. ఆ తర్వాత ఈ వైనాన్నంతా యూజీ తమ సహజ హాస్య ధోరణిలో 'నా ఉపద్రవం' (Calamity) అని ఎందుకంటారో వివరిస్తూ 'ఈ సహజస్థితి ఏదో మోక్షమని, బ్రహ్మానందమని, చెక్కుచెదరని శాంతి అనీ అనుకునేవన్నీ మీ వూహాగానాలే. నిజానికదో యాతన దేహానికి. ఆనందమో, విషాదమో, తెలీని అయోమయ స్థితి అని మీకు తెలిపేందుకోసం ఇదో వుపద్రవం అంటా'నంటారు.

యూజీ పూర్తి పేరు ఉప్పలూరి గోపాలకృష్ణమూర్తి. బందరులో పుట్టి గుడివాడలో పెరిగారు కాబట్టి నూటికి నూరు పైసలా మన ఆంధ్రుడేనని మనం చంకలు గుద్దుకోవచ్చు గాని వారుమాత్రం 'నేను ఏ దేశానికీ, ప్రాంతానికీ, కులానికీ, మతానికీ చెందను. నాకో ఠికానా లేదు' అంటారు.

యూజీ ఏం చెబుతారు తమ దగ్గరికొచ్చేవారితో? 'మీరు ముక్తి, జ్ఞానోదయం కావాలనుకుని వెతుకుతోంటే నా దగ్గరికి రాకండి. నేనేమీ అమ్మటం లేదిక్కడ. బజార్లో కావలసినంతమంది గురువులు సాధు వ్యాపారంలో తమ తమ సరకు అమ్ముకుంటున్నారు. వాళ్ళనాశ్రయించి మీ ముడుపులు చెల్లించుకోండి. ఏ అపోహలకి, అనుమానాలకి ఆస్కారమివ్వకుండా ఒక విషయం స్పష్టం చేస్తున్నా. నేను గురువును కాను. జ్ఞానిని కాను. నానించి మీకేం రాదు. ఏం లాభం జరగదు. అసలు నేను మీకేం చేయలేను. ఆ మాటకొస్తే నానించే కాదు, ఎవరినించీ మీకేం అవసరం లేదు కూడా. ఎవరన్నా మీతో అతీతమైనదేదో వుందనీ, ఇస్తామనీ చెబితే వాళ్ళ మాటలు మాత్రం నమ్మకండి. అదంతా వుత్త బూటకం. మీకు నేను చెప్పగలిగిందల్లా వొక్కటే : మీ చంకల కింది ఊతకర్రల్ని విసిరిపుచ్చుకు పారేయండి. మీకు పడిపోతావేమోనని భయం. అట్లా నూరిపోసి జీవితాంతం మిమ్మల్ని అవిటివాళ్ళుగా చేసారీ పుణ్యపుంగవులంతా. నే చెబుతున్నా. మీకేం కాదు. మీ కాళ్ళు నిక్షేపంగా వున్నాయి. కింద పడినా మీ అంతమీరే లేచి నడవగలరనే భరోసానిస్తున్నా. ఈ ఊతకర్రలకి బదులు సరికొత్త ఎలక్ట్రానిక్ ఊతకర్రల్ని నన్ను సప్లయి చేయమని అడక్కండి. మీకు ఏ ఆధారాలూ అవసరం లేదు.' అంటారు.

"జ్ఞానోదయమనేది వుంటే అది నూటికి నూరుపాళ్ళు భౌతిక, దైహిక స్థితి. దీనికి మతసంబంధమైన విలువలు లేవు. నైతిక, సామాజిక, ధార్మిక అంశాలకీ తావు లేదు యిందులో. దీనికి ఎల్.ఎస్.డి. (L.S.D.) వంటి మాదకద్రవ్యాలు సేవించడంవల్ల కలిగే స్థితులతో నిమిత్తం లేదు. అవన్నీ అనుభవాలు. ఇది కాదు."

"మానవ శరీరం వొక యంత్రం లాంటిది. రక్తనాళాల్లో రక్తపోటు, గుండె కొట్టుకునే శబ్దం, అన్ని రొదలూ కలిసి, జపం – ధ్యానం చేసే సమయాల్లో ఆలోచనల ఉధృతం తగ్గటంవల్ల, ఒక్కోసారి పెద్ద హోరుగా వినబడుతుంది. శరీర యంత్రంలో ఈ రొదనే విని, అదేదో ఓంకారమని, బ్రహ్మనాదమని భ్రమిస్తారని నా వాదం" అంటారు యూజీ.

ఈ విధంగా 'సహజస్థితి' అనేది కేవలం భౌతికమైన స్థితిగా చెబుతో నేటి తాత్విక, ఆధ్యాత్మిక, రంగాల్లో కొత్త వెలుగులు విరజిమ్ముతున్న యూజీకి ధ్యేయమనేది వుందా? "ఉంటే అది కేవలం ఈ సహజస్థితిలో నేనెట్లా మసులుతున్నానో వివరించడం – ఈనాడు ఆధ్యాత్మికం పేరిట చలామణీ అవుతున్న మోసాల్ని, అపోహల్ని, అవివేకాల్ని మీ మనసులకి ఎత్తిచూపడం – అంతకు మించి ఏ ధ్యేయమూ లేదు" అంటారు యూజీ.

అందుచేతనే యూజీకి ఆశ్రమాల్లేవు. సంస్థలు లేవు. నిధుల్లేవు. ఆయన ఏ కేంద్రాన్నీ స్థాపించలేదు. ఆయన వేదికలెక్కరు. ఉపన్యాసాలివ్వరు. పుస్తకాలు రాయరు. తమదొక ఫలానా దృక్పథమని చాటుకోరు. ఇంకోర్ని తమవైపుకి తిప్పుకొనే ప్రయత్నమన్నా లేదు వారిలో.

యూజీ ప్రసంగాలన్నీ ఇంగ్లీషు భాషలోనే. ఒక్క ఆధ్యాత్మిక విషయాలే కాదు, ప్రపంచ రాజకీయాలు, ఆర్థిక పరిస్థితులు, వైజ్ఞానిక పరిశోధనలు – ఇట్లా ఒకటేమిటి, 'రోగం నించి దైవం' దాకా – ఏ విషయంలోనన్నా సరే, నిర్దిష్టమైన శైలిలో అనర్గళంగా మాట్లాడి చర్చించగలిగే సామర్థ్యమున్న వ్యక్తి యూజీ కృష్ణమూర్తి. వీరి సంభాషణలు కొన్ని ఇప్పటికే నాలుగు పుస్తకాలుగా రూపుదాల్చాయి.

యూజీ ప్రపంచ పర్యటనలు గమనిస్తే తమ దగ్గరికి పరుగులు తీసే వారి బారి నించి తప్పించుకోవడం కోసం వీరు ఖండాంతరాలు తిరుగుతుంటారా అనిపిస్తుంది. 'ఒక దేశంలో స్థిరపడొచ్చుకదా. ప్రపంచమంతా ఈ ప్రయాణాలెందుకు?' అని అడిగాను ఒకసారి యూజీని. 'లోక సంగ్రహార్థం మాత్రం కాదు.' అని నవ్వారు యూజీ. ఆ దేశాల్లో.... ముఖ్యం అమెరికాలో కావలసినంత కాలక్షేపం : వినోదం. ఇంకో బలమైన కారణం వాతావరణం. 'ఆ దేశాల్లో చలి తాళలేకపోతే ఈ దేశం రావడం, పక్షులు వలసపోయినట్టు' అన్నారు.

డెబ్బై ఐదేళ్ళ ప్రాయంలో సాధారణ కొలబద్దలకి, నిర్వచనాలకి అందకుండా విశ్వమంతా విస్తరించే ఈ విచిత్ర వ్యక్తిని, ఏదో వొక మూసలో పోతబోసి, ఏదో ఒక చట్రంలో బిగించి, 'వీరు ఫలానా' అని చీట్లు అంటించే ప్రయత్నాలు చేసేవారికైతే అంతు లేదు. అట్లాంటి పట్టు వదలని విక్రమార్కుల ప్రయత్నాల్ని భగ్నం చేస్తో ఎప్పటికీ అర్థంకాని వొక చిక్కు ప్రశ్నగా మిగిలిపోతున్నారు యూజీ.

1993 **కొర్లిమర్ల చంద్రశేఖర్**

# యూజీ చింతన

ప్రియ మిత్రుడు శ్రీ రాజశేఖర్ యూజీ బ్రతికుండగా కలుసుకోలేదు. కాని, యూజీ ని గురించి చదివి, దృశ్య శ్రవణ మాధ్యమాల ద్వారా చూచి, విని అమితంగా ప్రభావితుడైనాడు. ఈ ప్రభావం ఎంత ఉధృతం అంటే రాజశేఖర్ గారి మనస్సులో, తమ తలపులో తమ హృదయంలో చివరికి కలల్లో కూడా యూజీ స్మరణ నిండి ఉంటుంది. యూజీతో కొద్ది కాలమైనా సన్నిహితంగా కలిసి జీవించిన నాలాంటి వారి నించి, దాహార్తితో నూతి లోంచి నీరు చేదుకొన్నట్లు, ఎడతెరపి లేకుండా, యూజీ గురించిన విషయాలు చేదుకొనే ప్రయత్నం చేస్తుంటాడు. ఒక్కోసారి ఈయన యూజీని చూడకపోయినా, ఎంతగా యూజీ ఈయన్ని 'పూనారా' అనిపిస్తుంటుంది నాకు.

మనిషికి ప్రకృతి ఇచ్చిన వరమూ, శాపమూ 'ఆలోచన'. ఆలోచనలను సాటి మానవులతో పంచుకోవాలనుకుంటే 'భాష' అవసరం. మనిషికి భాషను కూడా ఇచ్చింది ప్రకృతి. ఈ రోజు మనిషి సాధించిన ప్రగతి సమస్తమూ భాష సహాయంతో జరిగిందే. 'భాష' దైనందిన మనుగడకవసరమైన వ్యవహారాలకు మాత్రమే పరిమితం. అందువల్లే మనిషి ప్రాణికోటిలోని సమస్త ప్రాణులకన్నా విజయవంతంగా జీవించి ధరణీతలమంతా విస్తరించగలిగాడు.

ఈ మనిషే ఆలోచన, భాషల ద్వారా అన్వేషించి అంతిమ సత్యాన్ని కనుక్కోవాలనే ప్రయత్నాన్ని అనాదిగా చేస్తూ వచ్చాడు, నిరంతరం చేస్తూనే ఉన్నాడు. యూజీ కూడా ఇలానే అన్వేషించి, చివరికి అన్వేషణని అడ్డు గోడగా దర్శించి, తానూ అన్వేషణా వేరు కాదనే సత్యాన్ని స్ఫురింపచేసుకున్న మరుక్షణం ఆయనకు సహజస్థితి సిద్ధించింది. ఈ సహజస్థితిని ఉన్నది ఉన్నట్లుగా చెప్పాలనిపించిందంటారు యూజీ. సహజస్థితి సిద్ధించినప్పటి నించీ, ప్రపంచమంతటా, నిలకడ లేకుండా తిరిగి, భాష ద్వారా భాషకు అతీతమైనదాన్ని, అజ్ఞేయమైన స్థితిని గురించి మాట్లాడారు. అర్థం చేసుకోవడం అనే ప్రయత్నం ఆగిపోయిన స్థితి అది.

ఆయన చుట్టూ చేరి వింటున్న వారందరూ, పరిమితులున్న భాష ద్వారా అపరిమితమైన దాన్ని అర్థం చేసుకో ప్రయత్నించినవారే. ఏ భాషనుపయోగించి చెప్పినా విన్నవారికి స్ఫురించేది వారి Background ననుసరించే ఉంటుంది.

శ్రీ రాజశేఖర్ భిన్నమైన వృత్తిలో నిరతుడై ఉన్నా, అన్వేషణా ప్రవృత్తికి కూడా అంకితమై, ఆంగ్లంలో యూజీ చెప్పినదాన్ని అర్థం చేసుకోవడం కష్టతరమైన పాఠకుల కోసం అత్యంత ప్రయత్నపూర్వకంగా, అమిత శ్రద్ధతో పరిశ్రమించి ఈ Quotations ని తెలుగులోకి అనువదించడం చాలా ముదావహం. ఈ పుస్తకం సర్వాంగ సుందరంగా ముద్రణై పాఠకులను, నాలాంటి యూజీ అనుయాయులను అలరిస్తుందని భావిస్తాను.

మిత్రుడు రాజశేఖర్‌కి శుభాభినందనలు.

10-10-2012 **C. హనుమంత రెడ్డి**

ఆలోచనే నీ శత్రువు.

ఏదీ తెలియని స్థితే నీ సహజ స్థితి.

నీ లోంచి నీ గతాన్ని తోసి పారేయ్.

భయపడకుండా

నిన్ను నీవు వదిలేసుకొని ఉండు.

ఫిర్యాదు ల్లేకుండా

స్వీయ ఆలంబనంలో ఉండు.

వదిలేయ్, ఊరకే ఆగిపో.

వెతకటం ఆపు.

జీవితమనేది ఓ

ఏకీకృతమయిన ప్రక్రియ.

ఏకాకివై నిలవగల

ధైర్యం తెచ్చుకో.

జీవమనేది నిర్దేశన లేని వో కదలిక

ఏ ఉద్దేశ్యమూ లేకుండా రగిలే ఓ గాఢావేశం.

దేన్నయినా అర్థం చేసుకోవడానికి

నీ ఆలోచనల్ని ఉపయోగిస్తున్నంత కాలం

నీకు ఏ సజీవ శక్తి తోనూ సంపర్కం లేనట్లే.

ఓ ఆలోచన పుట్టిన ప్రతిసారీ

నీవు పుడుతున్నావు.

విషాదమెరుగని ఆనందం

అసహజం.

నాకు "నావి" అనదగ్గ ఒక్క ఆలోచనగాని,
ఒక మాటగాని, ఒక్క అనుభవంగాని లేవు.

మనం అనుభవించేదంతా ఆలోచనా ప్రేరితమే.
నీకు తెలియంది ఎప్పుడూ నీ అనుభవానికి రాదు.
దేన్నయినా అనుభవించాలంటే అది నీకు
తెలిసిఉండాలి.

నమ్మకం మీరాశించిన ఫలితాన్ని ఇవ్వలేకపోతే,
మీరు విశ్వాసాన్ని జోడిస్తారు.
అంటే "ఆశ" అని అర్థం.

నేను సమాజంతో ఘర్షణలో లేను. దాన్ని మార్చడంలో నాకు ఆసక్తి లేదు. నాలో ఓ మార్పు తీసుకురావాలన్న ప్రోద్బలం నాకు లేదు. కాబట్టి, ప్రపంచాన్ని మార్చాలన్న ప్రోద్బలమూ లేదు. నేను దుఃఖితులతో దుఃఖపడతాను. సంతోషంగా ఉండేవాళ్ళతో సంతోషంగా ఉంటాను.

తమ స్వంత దృష్టితో

అన్నింటినీ కొలవడమే 'మాయ' అంటే.

నీ పరిమితుల్ని తెలుసుకోవడమే వివేకం.

అదృష్టవశాత్తూ జీవితం నుండి
నీకేమీ లభ్యం కాదు.

నీవు ఉన్నట్టుగా కాక మరోలా
ఉండాలనుకోవడం వల్లనే నీవెప్పుడూ
యాతన పడుతూ ఉంటావు.

విలక్షణమైన జీవుల్ని అనంతంగా సృష్టించడంలో
ప్రకృతి నిమగ్నమయి ఉంది.
కాని సంస్కృతి అందరూ వొకే రీతిగా
మసులుకోవాలనే మూసని సృష్టించింది.
ఇది ఘోరం.

చైతన్యం ఎంత శుద్ధమంటే దాన్ని
స్వచ్ఛపరచడానికి నీవేమి చేసినా
దాన్ని మలినపరచడమే అవుతుంది.

‘మనస్సు’ అనబడే ఈ గందరగోళం ఎన్నో
వినాశనాల్ని సృష్టించింది.
ఇప్పటివరకు వాటన్నింటిలో అత్యంత
వినాశకారి ఈ ‘దైవ’మనేది.

ఇతర మార్గాలన్నింటినీ తిరస్కరించినపుడే
నీ స్వంత మార్గాన్ని కనుక్కోగలవు.

ఏమీ తెలియనప్పుడు చాలా మాట్లాడుతావు.
ఏ కాస్తయినా తెలిస్తే
అక్కడ మాట్లాడడానికేముంది ?

'ఏమిటిదంతా' అని తెలుసుకోవాలన్న ఆసక్తి
ఉన్న వారెవరికైనా ఉండే ఏకైక మార్గం –
ఈ వేర్పాటు ఎలా జరుగుతోందో గమనించడం,
నీ చుట్టూ, నీ లోపల జరుగుతున్న విషయాల నుంచి
ఎలా నిన్ను నీవు వేరు చేసుకుంటున్నావో
గమనించడమే.

ఓ సామాన్య వ్యక్తిగా ఉండడం
మహా కష్టతరమైన సంగతి.

రతిలోని చరమానుభవమొక్కటే జీవితంలో
తనదైన అనుభవానికి దగ్గరగా వచ్చేది.
తక్కిన అనుభవాలన్నీ చేతులు మారినవే.
అవి ఇతరులవే.

ఈ ప్రపంచపు వాస్తవికత నుండి తప్పించుకోవడానికి
నువ్వేం చేసినా, నీ చుట్టూ ఉన్న వాటితో సామరస్యంగా
జీవించడాన్ని అది కష్టతరం చేస్తుంది.

అవగాహన అంటే తప్పక అవగాహన
చేసుకోవాలన్న కాంక్ష లేకపోవడమే !

నువ్వు నువ్వుగా ఉండడం చాలా తేలిక,
అందుకు నీవేమీ చేయనవసరం లేదు.
ఏమీ ప్రయత్నించనవసరమూ లేదు.
కాని నీవున్నట్టు కాక మరోలా కావాలనుకోవడానికి
నీవు చాలా చేయాల్సి ఉంటుంది.



నీతో నీవు శాంతిగా ఉండాలని చేసే
ప్రతి యత్నమూ అప్పటికే అక్కడున్న శాంతిని
ధ్వంసం చేస్తోంది.

నీవు నీ సమాజపు ఆలోచనలే, ఆలోచిస్తావు.
సమాజపు భావాల్నే భావిస్తావు.
సమాజపు అనుభవాల్నే అనుభవిస్తావు.
కొత్త అనుభవమేదీ లేదక్కడ.

ఉన్నదేమిటో తెలుసుకోవడం
అసాధ్యం.

ఇంకా, ఇంకా,
విజ్ఞానం సంపాదించాలనుకోవడం –
ఇతరులపై మరింత ఆధిక్యాన్ని
సంపాదించడంకోసమే.

ఏదో ఒకటి 'చేయడం' అనేదానికి
ముగింపు పలక్కుండా మీరింకేదో
చేస్తున్నారు. అదే వచ్చిన చిక్కంతా.

ప్రపంచపు వాస్తవాన్ని గాని, ఉనికిని గాని
అర్థం చేసుకోవడం సాధ్యమేనని వొప్పుకోవడం
మూలానే మన సమస్యలన్నీ తలెత్తాయి.

ప్రతి ఒక్కరినీ తన నమూనాలో ఇమడ్చాలని
బలవంతపెట్టే మీ విలువల వ్యవస్థే
మానవకోటి దుఃఖానికి హేతువు.

కోరడం, యోచించడం
కలసికట్టుగా సాగుతాయి ఎప్పుడూ.

ఆశే నిన్ను కొనసాగిస్తుంది.

మీరు ప్రతి సంవత్సరమూ నా మాటల్ని విని
కేవలం మీ ఆలోచనల్ని స్పష్టపరచుకుంటున్నారు.
అది వృథా ప్రయాస.

మీకు సహాయపడడానికి నేనేమి చేసినా
అది మీ వేదనకి మరోటి జత పర్చడమవుతుందే కాని
మరేమీ కాదు. నన్ను వినడంవల్ల ఇప్పటికే
మీకున్నవాటికి మరో వేదనని
జోడించుకున్నవారవుతారు మీరు.

నిజానికి గతంలో ఎవ్వరూ తాకని చోట
జీవితాన్ని నీవు స్పృశించాలి.
దాన్ని నీకెవ్వరూ బోధించలేరు.

సుఖానికై నీ అన్వేషణ
దుఃఖాన్నే కొనసాగిస్తుంది.

'జ్ఞాన'మనే దాని జోక్యం లేకుండా
దేనినయినా చూడడమనేది కల్ల.

నీకు నీవు భరోసానిచ్చుకోవడం కోసం
ఓ లక్ష్యాన్ని కల్పించుకున్నావు.

నీకు భయం నించి ముక్తి పొందే భాగ్యమే అబ్బితే
అప్పుడింక భగవంతుడే ఉండడు.

జీవితాన్ని ఎలా జీవించాలన్న ఒక్క ప్రశ్నే
లక్షలాది ప్రశ్నలుగా రూపాంతరం చెందింది.

నిజమయిన 'గురువు' అంటూ ఒకడుంటే
మిమ్మల్ని తన నుంచి ముక్తుడ్ని చేస్తాడు.

మీరు వెతుకులాట ఆపరు.
ఎందుకంటే అట్లా ఆపడం
మీకు అంతమవుతుంది కాబట్టి.

మీరు వెతుకుతున్నారు. కనుకనే
మిమ్మల్ని మీరు పోగొట్టుకున్నారు.

జ్ఞానం అంటే అన్నింటినీ గుర్తించి
పేర్లు పెట్టడం మాత్రమే.

ఆలోచనల తాత్కాలిక స్వభావాన్ని
ఎదుర్కొనడంలో మీ విముఖత్వం నుండే
మీ అభద్రత తలెత్తుతుంది.

నేను చెబుతున్నదాన్నించి మీరు తయారుచేస్తున్నదాన్ని
ఆపడానికి ప్రయత్నిస్తున్నాను.

అసలు మనసే ఓ మిథ్య.
ఆ మిథ్యా మనసు కనిపెట్టిందే
'ఆధ్యాత్మికత'.

'ఎలా' అని ప్రశ్నించిన తక్షణం మీరు సమాధానాలకై
ఎవరో ఒకరి మీద ఆధారపడిపోతారు.

ఏదైనా జరగాలంటే,
ముందు అన్వేషణ ముగిసిపోవాలి.

ఎంత సన్నిహితుడని మీరనుకునే వ్యక్తినుంచయినా సరే
మీరు ఒక్క మాట కూడా వినలేరు.
మీరు సదా వినేది మీ స్వంత అనువాదాల్నే.

దైనందిన విషయాలపట్ల, మీ చుట్టూ జరిగే వాటిపట్ల
ఆసక్తి లేనందునే మీరు అతీతం, కాలరహితం,
దైవం, సత్యం, వాస్తవత్వం, జ్ఞానోదయం
మొదలైన వాటిని కల్పించుకొని, వాటికోసం
వెతుకుతున్నారు.

ఓ వ్యక్తిని తన సహజస్థితిలోకి ఏది తీసుకొస్తుందో
ఇంకోర్ని అలా ఎందుకు తీసుకురాదో నాకు తెలీదు.
బహుశా అది జీవకణాల్లోనే వ్రాసి ఉందేమో.

‘సంభాషణ’ అనేది అసాధ్యం. ‘నీవు’ అనేది లేనప్పుడు,
‘ప్రశ్న’ అనేది మాయమైనప్పుడు అక్కడుండేది కేవలం
‘అవగాహన’ మాత్రమే. అక్కడితో నీ పని ఆఖరు.
నీవు బయటపడతావు.

‘నువ్వు’ నువ్వుగా ఉండడానికి అసాధారణమైన తెలివి
అవసరం. అలాంటి తెలివి నీకు వరంగా వచ్చింది.
దాన్ని నీకెవ్వరూ ఇవ్వాల్సిన అవసరం లేదు.
నీనుండి ఎవరూ కాజేయలేరు.
దాన్ని తన చిత్తం వొచ్చిన రీతిలో వ్యక్తం
కానిచ్చినవాడే సహజ మానవుడు.

మనిషి తరతరాలుగా సంక్రమించిన
సంప్రదాయ సంకెళ్ళని తెంచుకుని
ముక్తుడైనప్పుడే తొలిసారిగా
మానవుడవుతాడు.

జంతువులు అనుసరిస్తాయి.
జంతువులు నాయకులను ఏర్పాటు
చేసుకుంటాయి. జంతు లక్షణాలు ఇంకా
మనిషిలో కొనసాగుతున్నాయి.
కనుకనే మనిషి ఓ నాయకుడిని
సృష్టించి, అనుసరిస్తున్నాడు.

నీ సహజత్వం, నీవు తెలుసుకోవాల్సిన
అవసరం లేనిది. నీవు దాన్ని,
తన స్వంత మార్గంలో వ్యక్తం కానివ్వాలి.

ఈ సంఘమో, సంస్కృతో నీలో నింపిన ఉత్తేజాల
మూలంగా, ఈ క్షణం నువ్వు చేస్తున్న దానికన్నా
ఆసక్తికరమైందీ, అర్థవంతమైందీ, ప్రయోజనకరమైందీ
మరేదో వుందనిపించి అలజడి పడుతున్నావు.

తృప్తి నెరగకుండా ఆకలి తనకు తాను పూర్తిగా
మండిపోవాలి. నీ దాహం అనేది అది
తీరకుండానే తనకు తాను ఆవిరైపోవాలి.

మతాధిపతులు ప్రసాదించిన మత పద్ధతిలో
నీ ప్రాపంచిక జీవితాన్ని దిద్దుకోవాలనుకుంటే,
భౌతిక ప్రపంచపు వాస్తవికతను ఉన్నది ఉన్నట్లుగా
అంగీకరిస్తూ సామరస్యంతో జీవించే అవకాశాన్ని
నాశనం చేసుకోవడమే అవుతుంది.

ఏ దిశగానైనా, ఏది చేసినా సరే అది హింసే
అవుతుంది. ఏ ప్రయత్నమైనా సరే, అది బలవంతమే.
ఓ ప్రశాంత మనోస్థితిని కల్పించడానికి ఆలోచనా
బలప్రయోగంతో నీవు చేసే ప్రయత్నమేదైనా,
అది హింసే.

దేన్నించయినా, ఏ కారణంగానైనా సరే,
స్వేచ్ఛ పొందాలని నీవేం చేసినా అది, అదివరకే ఉన్న
సున్నితత్వాన్నీ, స్పష్టతనీ, స్వేచ్ఛనీ ధ్వంసం చేస్తుంది.

ఈరోజే అంతు చూడాలనుకోవడం కార్యశూరత్వం. రేపు చూద్దామనుకోవడం కేవలం ఆశతో ముడిపడి ఉంటుంది.

అన్వేషణ కోసమై మీరు వెచ్చిస్తున్న శక్తి, మీరు జీవించడానికి అవసరమైన శక్తిని హరించివేస్తోంది.

అవసరమైనంత కఠినాత్ములైతే ఈ ప్రపంచంలో
మీరు వాంఛించినదాన్ని పొందడం
చాలా సులభతరం.

సమస్త మానవాళి అనుభవాన్ని నీలోంచి
విసిరివేయగలిగితే తప్ప
నీవు నీదైన విలక్షణత్వంలోకి రాలేవు.
అప్పుడే నీవు నీవుగా వుండగలవు.

బతకడం, పుట్టించడాల మీదనే ఆసక్తి ఉన్న
దేహం, బాధకీ, సుఖానికీ ఒకేలా స్పందిస్తుంది.
బాధని వారించాలనీ, సుఖాన్ని పొడిగించాలనీ
పట్టు పట్టేది నువ్వే !

నాకు సంతోషమేమిటో తెలియదు కనుక,
నేనెప్పుడూ అసంతోషంగా ఉండను.

నిద్రించేప్పుడు దేహాన్ని నియంత్రించే మాట అటుంచి,
అసలు నీ ప్రజ్ఞ ఏమాత్రం లేకుండానే
నీ శరీరం ఎన్నిసార్లు అటూ, ఇటూ సర్దుకుంటోంది ?
దేహం తన్ను తానే దిద్దుకుంటుంది.

నీ అన్వేషణలోని అసంగత్వాన్ని నీవు స్వయంగా
దర్శించినప్పుడు సంస్కృతి సమస్తం నీలో
బూడిదవుతుంది. అప్పుడే ఆ వెతుకులాట నించి
బయటపడతావు.

ప్రశ్నించడం వివేకానికి గీటురాయి కాదు.
ప్రశ్నించడం ఆగిపోవడమే వివేకం.

మానవజాతి పోగుచేసుకున్న సమస్త విజ్ఞానం,
అనుభవం, విషాదం అన్నీ నీలో ఉన్నాయి.
నీలో ఓ పెద్ద భోగిమంట వేసుకోవాలి.
అప్పుడే నీవో స్వతంత్ర వ్యక్తివవుతావు.
వేరే మార్గమే లేదు.

నీ తల్లిదండ్రుల రతిక్రియ ఫలితంగానే
నువ్వు జన్మించి, జీవిస్తున్నావు. అంతే.
జీవితానికేదో పరమార్థం వుందని ఆశించకు.

నీవు ఎలా ఆలోచిస్తున్నావో, ఎలా భావిస్తున్నావో,
ఎలా అనుభవిస్తున్నావో, ఈ ప్రపంచంలో
ప్రతి ఒక్కరూ ఖచ్చితంగా అదే మార్గంలో
ఆలోచిస్తున్నారు. అలానే భావిస్తున్నారు.
అలానే అనుభవిస్తున్నారు.

దృశ్యమే ద్రష్టని కల్పిస్తోంది.

ఏ లక్ష్యాన్ని సాధించి పొందాలని సమాజం
మనందరికీ ఎత్తి చూపిందో
దేన్నయితే సంస్కృతి మన నెత్తిన రుద్దిందో
అదే ఈ సజీవ శరీరం పాలిట శత్రువు.

ఆనందం అనేది సంస్కృతి మనలో పాతిన ఒక భావం.
అసలు 'ఆనందం' అనేదేదయినా ఉందా అంటే,
నేను లేదనే అంటాను.

దేన్నయినా మార్చడానికి చేయవలసిందేమీ లేదు.
అన్నీ వాటి స్వంత మార్గంలో అవే మారుతున్నాయి.

తప్పొప్పులు, మంచీ చెడులనే ద్వంద్వ విభజనలో
ఇరుక్కోనంత కాలం నీవు ఏ తప్పూ చేయవు.
ఈ ద్వంద్వాల్లో ఇరుక్కుంటే మాత్రం నీవెల్లప్పుడూ
తప్పు దారినే పట్టే ముప్పు ఉంటుంది.

సమాధానాలు కాదు ప్రశ్నలు సమసిపోవడమే
ముఖ్యమైన సంగతి.

నన్ను ఆదర్శంగా తీసుకొమ్మనిగాని లేదా
నా అడుగుజాడల్ని అనుసరించమని గాని
నేనెవ్వరికీ, ఎప్పటికీ సూచించను.

మనిషి మతాన్ని సృష్టించుకున్నాడు.
అది తనకో ముసుగునిస్తుంది కనుక.

కళాకారుడు కూడా ఇతర వృత్తి నిపుణుల్లానే
ఓ నిపుణుడు. అతడు ఆ పనిముట్టునుపయోగించి
తన్ను తాను వ్యక్తం చేసుకుంటాడు.
'కళ' అనబడేదంతా ఇంద్రియాత్మక చలనమే.

మీ ప్రముఖ సంగీత విద్వాంసుల సంగీతంలోకన్నా
మొరిగే కుక్కల బృందగానంలో ఎక్కువ
జీవం ఉంటుంది.

తన తదనంతరం ఈ లోకానికి గంపెడు
గందరగోళాన్ని వదలి వెళ్ళేవాడే ప్రవక్త.

మన పరస్పర సహజీవనానికి సాయపడేది
ప్రేమ కాదు, సహోదరత్వం కాదు
– అది భయోత్పాతమే.

బార్‌కో – పబ్‌కో వెళ్ళడమూ,
ఆలయానికి వెళ్ళడమూ
రెండూ సరిగ్గా ఒక్కటే.
అది శీఘ్ర పరిష్కారం.

దైవం – కామం జంటగా సాగుతాయి.
దైవం పోయిందా, కామం కూడా గోవిందా.

సంతోషానికై వెతుకుతున్నంత కాలం నీవు
విచారంతోనే మిగులుతావని మాత్రం
భరోసానివ్వగలను.

'నిన్ను నీవు తెలుసుకో' అన్నదో పెద్ద హాస్యోక్తి - ఈ మాట
ప్రాచీన జ్ఞానాన్ని పరిరక్షించే పవిత్రాత్ములు మాత్రమే కాదు.
ఆధునిక శాస్త్రజ్ఞులు కూడా అంటూనే ఉంటారు.
ఆత్మ జ్ఞానం, ఆత్మ సాక్షాత్కారం, క్షణ - క్షణం
జీవించడంలాంటి చెత్త మాట్లాడడానికి మానసిక శాస్త్రవేత్తలు
కూడా ఇష్టపడుతుంటారు.

వినయం అనేది ఓ కళగా సాధనచేసేది.
అసలు వినయం అనేదేమీ లేదు.
ఏదైనా నీకు 'తెలిసి' ఉన్నంతకాలం 'వినయం'
అనేదుండదు. ఆ 'తెలిసిన'ది, 'వినయమూ'
ఒకేసారి కలసి ఉండలేవు.

ఎంతటి అసాధారణ అనుభవాలైనా సరే
ఇంద్రియ స్పందనల పరిధిలోనే ఉన్నాయి.

ప్రేమ, ద్వేషాలు ఒకే వర్ణ పటానికి ఎదురెదురు కొనలు.
అవి రెండూ ఒకటే, ఒకే విషయం కూడా.
అవి అతి దగ్గరి దాయాదులకన్నా సన్నిహితం.

ఈ లోకంలోని ఆరు వందల కోట్ల జనాభాలో
నీలాంటి వాడింకెక్కడా లేడు.
ప్రతి వ్యక్తీ పరిణామ ప్రక్రియచే సృజింపబడిన
అసాధారణ జీవే!

గురువులు ఓ సామాజిక పాత్ర పోషిస్తారు.
అలానే చేస్తారు వేశ్యలు కూడా.

హిందూయిజం మామూలు అర్థంలో అన్నిటిమల్లే
ఓ మతం కాదు.
అది ఎన్నో విషయాల, గందరగోళాల కలగాపులగం.
అది వందలకొద్ది దుకాణాలుండే బజారులాంటిది.

జీసస్, బుద్ధుడు లేక కృష్ణుడులాంటి వారిని ఆదర్శంగా
తీసుకొని అనుసరించడంవల్ల, విలక్షణ వ్యక్తుల్ని
విరజిమ్మగల సృష్టి సామర్థ్యాన్ని నాశనం చేసుకున్నాం.

'నీ తోటి వారిని నీ వలె ప్రేమించు' అని ప్రవచించిన
మనిషే ఈనాటి ప్రపంచ భీభత్సానికి బాధ్యుడు.

సంగీతం, కవిత్వం ఇంకా ఇతర కళల మీద అభిరుచులన్నీ సంస్కృతీపరంగా నిర్ధారింపబడి, ఆలోచనతో ముడిపడినవే. పిల్లి కూతల బృందగానంకన్నా, బిథోవెన్ తొమ్మిదో సింఫనీ ఇంకా వినసొంపుగా ఉంటుందని చెప్పేది నువ్వు అలవరచుకున్న అభిరుచే. రెండూ సమానమైన స్పందనల్నే కలిగిస్తాయి.

ఈ గ్రహం మీద తక్కినవాటికన్నా మనమేమీ అధిక ప్రయోజనకారులమో లేక ప్రజ్ఞావంతులమో కాదు. ఇక్కడున్న చీమలకన్నా, మన చుట్టూ ముసిరే ఈగలకన్నా, మన రక్తం పీల్చే దోమలకన్నా వేరే ఏ గొప్ప ఉద్దేశ్యంతోనో మనం సృష్టింపబడలేదు.

ఏదో ఒక దానిపై ఆధారపడడం అనే అసంబద్ధతను
మనం అంగీకరించాలి.
మన నిస్సహాయతను మనమే ఎదుర్కొని తీరాలి.

నీకు నీవు విధించుకున్న వైరాగ్యదీక్ష ద్వారా
నీ ప్రజ్ఞని విస్తరించుకుని తద్వారా ఆనందంగా
ఉండగలననుకుంటావు.
ఆ అవకాశమే లేదు.

నీవో యంత్రానివైపోవాలి.
నీవు చేస్తున్న పనుల ముందు గానీ,
అవి జరుగుతున్నప్పుడు గానీ, జరిగాక కానీ
ఎన్నడూ ప్రశ్నించకుండా యాంత్రికంగా
మసలుకోవాలి ఈ లోకంలో.

ఏదో ఒకటి తిరిగివ్వకుండా సమాజం నిన్ను పోషించదు.
అది, వాళ్ళు కోరేదే ఇవ్వాలి తప్ప నీవేమి ఇయ్యాల్సి
ఉందో అది కాదు.

ఎప్పుడయితే ఆశించడం, అర్థం చేసుకోవడానికి,
ప్రయత్నించడం ఉండవో,
అప్పుడు, జీవితం అర్థవంతమవుతుంది.

నేను సూచించేదేమంటే, అస్తిత్వపు మర్మాలను
అర్థం చేసుకోవాలనే బలీయమైన వాంఛ విధ్వంసకరం.
ఆ రహస్యాల్ని అలానే వదిలేయ్!

శాశ్వతమైనదేదో ఉండి తీరాలని మనమపేక్షిస్తాం.
ఈ మతగురువులమ్మే చిల్లర సరుకంతా అదే!
వాళ్ళు మీకు శాశ్వతానందాన్ని అమ్మజూపుతారు.

బతకడానికి అవసరమైన తెలివితేటలు,
భౌతిక జీవుల నిర్మాణంలో సహజంగానే ఉన్నాయి.
కొత్తగా నీవేమీ నేర్చుకోనవసరం లేదు.

ఆనందంగా ఉండే క్షణాలు ఉంటాయి.
విచారంగా ఉండే క్షణాలూ ఉంటాయి.
కానీ శాశ్వతానంద స్థితిలో ఉండాలనే అపేక్ష,
దేహానికి శత్రువవుతుంది.

మనస్సు, తన ఉత్తమ ప్రయోజనాలుగా
భావించిన వాటిని కాపాడుకునేందుకు
మతాన్నీ, డైనమైట్‌నూ కనిపెట్టింది.

ఉన్న మాటేమిటంటే, మీకే సమస్యా లేకపోతే మీరే
ఓ సమస్యని సృష్టించుకుంటారు.
సమస్యే లేకపోతే అసలు జీవిస్తున్నట్లు మీకనిపించదు.

నిస్వార్థపరుడవడంకోసం
ఏదో చేస్తున్నంతకాలం
నీవో స్వార్థపరుడుగానే మిగిలిపోతావు.

సత్యమనేది ఓ కదలిక, దాన్ని బంధించలేవు,
నిలుపుకోలేవు. దాన్ని వ్యక్తపరచలేవు.
దాని ద్వారా నీ ఆసక్తుల్ని తీర్చుకోలేవు.

ఓ సహజ మానవుడు సమాజానికేమీ పనికిరాడు.
పైగా అందుకు విరుద్ధంగా అతడో
ప్రమాదకారి అవుతాడు.

ఏదో తనకి తాను వ్యక్తమవ్వాలని యత్నిస్తోంది.
కాని, సంస్కృతి దాన్ని అణిచేస్తోంది.
ఆ సంస్కృతిని ఒక్కసారి అది బయటకి నెట్టివేయగలిగితే
ఇంక తనను తాను, తనదైన రీతిలో వ్యక్తపరుచుకుంటుంది.

నాలో, నీలో వ్యవహరిస్తున్న ఈ చైతన్యం ఒక్కటే.
దానికి నాలో ఎల్లలు లేవు. నీలో ఉన్నాయి.
అది నిన్ను ఆవరించుకుని వుంది.

నీవో సాధారణ జీవివి కావు. అసాధారణ జీవివి.
మన ముందు ప్రతిష్ఠించిన పరిపూర్ణత్వమనే
ఆదర్శం సమస్తాన్నీ తప్పుదారి పట్టించింది.
'పరిపూర్ణ వ్యక్తి' అనబడేవాడెక్కడా లేడు.

ఆలోచన ఉన్నది కేవలం వ్యక్తీకరణ
ప్రయోజనాలకోసమే. అంతేగాని,
దానికి వేరే ఏ విధమైన విలువా లేదు.

జీవమే నీకు దారి చూపుతుంది.
స్వీయరక్షణ చేసుకుంటూ కొనసాగడమే జీవాంగానికున్న ఆసక్తి.
దానికేం చేయాలో జీవికి తెలుసు.
ఊరికే నీ కళ్ళు, చెవులను ఉపయోగిస్తే చాలు.
అవే నీకు తోవ చూపుతాయి.

ఈ మత పెద్దలు నీలో ఓ పోలీసుని సృష్టించారు.
ఐతే, అది నీకేరకంగానూ సహాయపడలేదు.

నీకేది శ్రేయస్సో నీకు తెలీదు. నీకు తెలిసిందల్లా కేవలం
నీకు ఏది మంచిదవుతుందనుకుంటావో అదే.
నీ ఆసక్తి అంతా దానిమీదే. దాని ఆధారంగానే
నీ కళాభినివేశాలు, తర్కచాతుర్యాలు.

నీతిమంతుడనబడేవాడు ఉత్త భయస్తుడు, పిరికిపంద.
అందుకే అతడు నైతికతని సాధన చేస్తూ,
ఇతరులపై నీతి తీర్మానాలు చేస్తూ కూచుంటాడు.

నీవు దేన్ని చూస్తున్నావో దాన్ని గుర్తించకపోతే
దానర్థం 'నీవు' అనేదక్కడ లేదని.

'జ్ఞాని'కి శిష్యులుండే వీల్లేదు. ఎందుకంటే,
తన అనుభవమనేది ఇంకోరితో పంచుకోగలిగింది
కాదు గనుక. కనీసం సాధారణ అనుభవాల్ని కూడా
మనం ఇతరులతో పంచుకోలేం.
రతి అనుభవమెన్నడూ ఎరుగని వ్యక్తికి
అదెలా ఉంటుందో మీరు చెప్పగలరా ?

ఏ ఊహా లేకపోవడం
ఏ ఇచ్ఛా లేకపోవడం
ఏ ప్రయత్నమూ లేకపోవడం
ఏ దిశగా అయినా సరే, ఏ స్థాయిలోనైనా సరే,
ఏ పరిమాణంలోనయినా, ఎలాంటి చలనమూ లేకపోవడం-
అదీ అసలు విషయం.

సకల గుణాభిరాముడైన వో సద్ధర్మమూర్తిని
మానవ ఆదర్శంగా నిలిపాం. కాబట్టి, ఆ పరిపూర్ణత్వ
లక్ష్యాన్ని అందుకోడానికి నీవు చేసేదంతా
శరీర సున్నితత్వాన్ని ధ్వంసం చేస్తోంది.

నీ వెనుకటి మానవులు పొందిన సమస్తానుభవాల్నీ, భావనల్నీ పూర్తిగా ఊడ్చివేయగల ధైర్యం ఉంటే – అది అసలైన ధైర్యం.

సద్గుణ సాధనే లక్ష్యంగా ప్రాకులాడే తత్వం నించి ముక్తుడయ్యే భాగ్యశాలివైతే, దుర్గుణాలు కూడా దాంతోపాటే నీ వ్యవస్థ నుండి నిష్క్రమిస్తాయి.

నీవూ, నేనూ పోయినా జీవశక్తి కొనసాగుతుంది.
ఆ దీపాలు ఆరిపోతాయి కాని,
విద్యుచ్ఛక్తి కొనసాగుతూనే ఉంటుంది.

ఏది నాకు సత్యమో దాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ
మీకు తెలియచేయడం అసాధ్యం.
ఇక్కడున్న నిశ్చితత్వం మరొకరికి ప్రసరింప సాధ్యం కానిది.
అందుచేత ఈ గురు వ్యాపారమంతా నిశ్చయంగా
పనికిమాలిన చెత్తే !

నాకు విద్యా బోధనపై నమ్మకం లేదు. మీరు సాంకేతిక జ్ఞానాన్ని ఇవ్వగలరు – లెక్కలు, ఆటో మెకానిక్స్ – ఇలాంటివి. మీరు ఋజుత్వాన్ని నేర్పలేరు. పేరాశ, లోభత్వాలతో వెర్రెత్తిపోతున్న సంఘంలోని వాళ్ళకి అవి లేకుండా జీవించడాన్ని ఎట్లా బోధిస్తారు ? వాళ్ళని మరింత వెర్రివాళ్ళుగా చేయడంలో మాత్రమే సఫలమవుతారు.

ఈ జీవితంతో ఇంకా ఏదో అర్థవంతమైనదీ, ఆసక్తికరమైనదీ చేయవచ్చునన్న అశాంతి భావనని నీలో కలిగించడంలోనూ, దుఃఖంతో, బాధతో జీవితంలో నిన్ను దిక్కు లేకుండా కొట్టుకొని పోయేట్టు చేయడంలో మాత్రమే ఈ ఋషులూ, అవతారపురుషులూ విజయం సాధించారు.

సాంకేతిక జ్ఞానం మాత్రమే పురోగమిస్తోంది.
ఒక జాతిగా మనం, మన ప్రపంచ వినాశనానికి,
జాతి వినాశనానికి సమీపంగా జరుగుతున్నాం.

పరిణామ ప్రక్రియలో హింస ఓ అంతర్గత అంశం.
జీవంతో కొనసాగడానికి జీవికి ఆ హింస తప్పనిసరి.
మన భద్రతకోసమై ఏర్పరచుకున్న పోలీసు వ్యవస్థకి
కొనసాగింపే హైడ్రోజన్ బాంబు.
కనుక బాంబుల్ని ఖండించలేం.

నేను చెప్పదలచేదేమంటే, ఏదో ఒకటి నీకై నీవే కనుక్కోవాలి. కాని, నీవు కనుక్కున్నది సమాజానికి ఉపయోగపడుతుందనో, ప్రపంచాన్ని మార్చడానికది పనికివస్తుందనో పొరబడకు. సమాజంతో నీకు తీరిపోయింది. అంతే.

భగవంతుడంటే 'పరమ సుఖం'
'నిరంతరానందం'.
అట్లాంటిదేదీలేదసలు.
పరివర్తన, మోక్షం, విముక్తి ఇంకా ఈ తుక్కు అంతా
'శాశ్వతానందం' అనే ఒకే అంశానికి విభిన్న రూపాలు.

ఉన్నది ఒకే ఒక్క ఆలోచన. ఆ ఒక్క ఆలోచనకు
ముడిపడే అన్నీ ఉన్నాయి. అదే 'నేను' అన్న ఆలోచన.
దాని ఆధారంగా నీవు పొందే ఏ అనుభవమైనా భ్రమే !

నీ మనసు, నా మనసు అంటూ ఏమీ లేదు.
ఉన్నది కేవలం **'మనస్సు'**
మానవుడు తెలుసుకున్నదీ, భావించినదీ,
అనుభవించినదీ, తరతరాల నించి
సంక్రమింపచేసుకున్నదంతా కలసి,
సమస్తమూ అదే.

నేను ముఖ్యంగా నొక్కి చెప్పేదేమంటే,
మౌలిక మానవ సమస్యలను మానసిక చట్రం ద్వారా
పరిష్కరించడానికి మనం ప్రయత్నిస్తున్నాం.
కాని వాస్తవానికి సమస్య నాడీ వ్యవస్థకి సంబంధించినది.
శరీరం చిక్కుకొని ఉంది.

నువ్వు చెబుతున్న 'అహం' గానీ, 'తాను' గానీ ఎక్కడుంది ?
ఉనికే లేని నీ 'తాను' ఎవరినించో ఆధ్యాత్మికత గురించీ,
బ్రహ్మానందం గురించీ విన్నది.
ఈ బ్రహ్మానందమనేదాన్ని అనుభవించడానికి నీ ఆలోచనల్ని
నియంత్రించి తీరాలి అనుకుంటావు. అది అసాధ్యం.
ప్రయత్నించావో, నిలువునా మండి మసయిపోతావు.

మానవుడు ఏనాడైతే ఇతర జీవరాశులకన్నా తాను
భిన్నమనీ, అధికుడనని అనిపించే స్వీయ చైతన్యాన్ని
అనుభవానికి తెచ్చుకున్నాడో ఆనాడే తన జాతి
వినాశనానికి బీజాలు నాటుకోవడం మొదలుపెట్టాడు.

నేను చెప్పదలచిందంతా ఏమంటే నీవు తపనపడే
ఆ ఉన్నత స్థాయి నీలో సిద్ధంగానే ఉంది.
అది నీ శరీర సామరస్యపు పనితీరులోనే ఉంది.

నేనేమీ హెచ్చరించేవాడిని కాను.
నేను భయపడడం లేదు కూడా .
ఈ ప్రపంచాన్ని రక్షించడంలో నాకేమీ ఆసక్తి లేదు.
ఎటొచ్చీ మానవాళి నాశనం ఇప్పటికే
నిశ్చయమయి ఉంది.

కాంక్షలన్నిటిలోకీ తీవ్రకాంక్ష అయిన మోక్షం, ముక్తి, ఆత్మసాక్షాత్కారాల నించి నీవు విముక్తి పొందకపోతే క్రుంగి కుమిలిపోతావు. సమాజం మనకి జీవితాదర్శంగా నిలిపిన ఆ వొక్క చరమలక్ష్యం – అది పోవాలి ముందు.

అలవోకగా ఉండడాన్ని ప్రయత్నంతో
సాధించడమనేది యుద్ధంతో శాంతిని
సాధించడం లాంటిదే.

'ధైర్యం' అనేది ఓ లక్ష్యాన్ని చేరేందుకు ఉపయోగించే
పనిముట్టో, గుణమో కాదు. చేస్తున్నది (సాధన) ఆపడం ధైర్యం.
నీలోని సంప్రదాయానికి ముగింపు పలకడం ధైర్యం.

ఉన్న పరిస్థితి నుండి తప్పించుకోవడమొక్కటే
నీ లక్ష్యం. ఎందుకు తప్పించుకోవాలనుకోవడం ?
ఉన్న పరిస్థితి నించి తప్పించుకోచూడడమే
అసలు నీకు చిక్కుల్ని తెచ్చిపెడుతోంది.

"చైతన్యం, తన్ను తాను వెలుపలికి ఊడ్చేసుకోవాలి.
పవిత్రత, అపవిత్రతల జాడలు ఏమాత్రం లేకుండా
సమస్తాన్నీ తన్ను తానే క్షాళన చేసుకోవాలి.
నీవు దివ్యమని, పవిత్రమని భావించేది కూడ
ఆ చైతన్యంలో కల్మషమే !

నా వద్ద 'బోధన' అనేది లేదు.
భద్రపరచడానికేమీ లేదు.
అసలు 'బోధన' అంటే ఏదైనా మార్పు తేవడానికి
ఉపకరించేదని అర్థం. అతుకు బొతుకుల్లేని
విడి విడి వాక్యాలు తప్ప నా దగ్గర
బోధించడానికేమీ వుండవు. సారీ !

తెలుసుకోవడానికేదో ఉందని నీవు యోచించి,
వొప్పుకుని, నమ్మినంతకాలం
అన్వేషణను, ఘర్షణను ఆశిస్తున్నంతకాలం
నిన్ను నువ్వు పోగొట్టుకుని దీనాతిదీనంగా బతుకుతావు.

నేను చెబుతున్న దాన్నించి నీవేమి అర్థం చేసుకోవడానికి
యత్నించినా, అది సరైనది కాదు. ఓ రకమైన
తాజాదనాన్ని, సజీవత్వాన్ని నా మాటల్లో గ్రహిస్తారు మీరు.
అది అంతే కాని, మరే యితర ప్రయోజనమూ లేదు.
ఇది నిరర్థకం !

(జ్ఞానోదయం పొందిన) అలాంటి వ్యక్తి ఎవరైనా ఉంటే
అతనెక్కడో దాక్కొని ఉండడు.
అతడెక్కడున్నా ధృవతారలా వెలుగుతూ ఉంటాడు.
అలాంటి వ్యక్తుల్ని నీ కొలపాత్రల క్రింద దాచలేవు.

మానవాళి సమస్యలకి ఏకైక పరిష్కారమనేది కొత్త భావాల ద్వారానో, కొత్త సిద్ధాంతాల ద్వారానో, నవీన ఆదర్శాల ద్వారానో కాదు. మానవ దేహ రసాయన తత్వంలో తిరుగులేని మార్పు తేవడం ద్వారా మాత్రమే అది సాధ్యం.

సత్యం, వాస్తవికతలకై వెంపర్లాట పడి
నీవేం చేసినా, అది సదా నీవుంటున్న
సహజ స్థితినించి నిన్ను దూరం చేస్తుంది.

నీ మౌలిక అవసరాల్ని నిరాకరించుకోవడం
ఆధ్యాత్మిక లక్షణం కాదు.
కాని, కూడు, గుడ్డ, గూడులను మించి
ఆశించడం మాత్రం మనోవైకల్యమే.

నీ రోజువారి అనుభవాలపట్ల నీకు అసంతృప్తి
కనుక కొత్తవాటిని కోరుకుంటావు.
నిన్ను నీవు మార్చుకోవాలనుకుంటావు.
పరిపూర్ణుడిగా మలుచుకోవాలనుకుంటావు.
నీకు నీవుగా కాక ఇంకోలా ఉండడానికి
ప్రయత్నిస్తున్నావు.
నిన్ను నీ నుండి దూరం చేసేది ఇదే !

నీలోని ఆలోచనా చలనం జీవ స్పందనతో
సమాంతరంగా సాగినా దాన్నించి వేరుపడే ఉంటుంది.
అది ఎప్పటికీ జీవితాన్ని స్పృశించలేదు.
నీవో 'జీవ'మున్న ప్రాణివై ఉండీ, దాన్నించి విడిపడి,
సమాంతరంగా సాగుతున్న యోచనా సంచార పరిధిలోనే
బతుకుతావు జీవితాంతం.
నిన్ను నీ 'జీవం' నించి తెంచుకున్నావు.

సహజ స్థితి అంటే ఆలోచన లేని స్థితి కాదు.
ఎప్పటికీ ఆలోచన లేకుండా ఉండలేవు.
ప్రాణంతో కొనసాగడానికి
ఆలోచించడం అవసరం.
కాని ఈ స్థితిలో ఆలోచన
నిన్ను ఉక్కిరిబిక్కిరి చేయదు.
అది దాని స్వంత లయలో పడుతుంది.

ఈ సంస్కృతి వత్తిడే లేకుంటే జీవశక్తి మీరు
గొప్పగా భావించే గులాబీని మాత్రమే కాక
రకరకాల రీతుల్లో, ఎన్నెన్నో వైవిధ్య పుష్పాల్ని
సృష్టించి ఉండేది. మీరేమో అన్నింటినీ
ఒకే మూసలో పోత పోయాలంటారు.
ఎందుకలా ?

ఇది నాకు జరిగినప్పుడు నా అన్వేషణ అంతా తప్పు
దారిలో సాగిందని తెలుసుకున్నాను.
ఇది మత సంబంధమైనదో, మానసికమైనదో కాదనీ,
కేవలం దేహేంద్రియాలు తమ అత్యున్నత
శక్తి సామర్థ్యాలతో వ్యవహరించే
భౌతిక కార్యకలాపమేననీ గ్రహించాను.

ఎందువల్లనో, మరి దేనికోసమో కాని,
సమగ్రత, సంపూర్ణతల్లోకి పరిణమించగల
సామర్థ్యానికి ఉన్న అవకాశాలను
సంస్కృతి పరిమితం చేసింది.

తన ప్రవృత్తికి విరుద్ధంగా ఉండి,
తన్ను ఆవరించి కప్పేసిన
నిర్జీవ ఆలోచనానుభూతుల కట్టడాన్ని
కూలద్రోయాలని జీవశక్తి శ్రమిస్తోంది.
దాని బ్రద్దలుకొట్టి
బయటపడాలని ప్రయత్నిస్తోంది.
నీకది ఇష్టం లేదు.

భ్రమలన్నీ నీలోంచి పూర్తిగా
తుడిచిపెట్టుకుపోవాలి.
అప్పుడే సత్యం తనదైన రీతిలో
తనను తాను వ్యక్తపరచుకోవడం ఆరంభిస్తుంది.

మనఃశ్శరీరాల మధ్య విభజన తొలగిపోవాలి.
నిజానికి విభజనేమీ లేదు. నాకు "మనసు" అనే పదం
వాడడానికి అభ్యంతరం లేదు.
కాని, దానికో నిర్దిష్టమైన స్థానం గానీ,
ప్రదేశం గానీ లేదు. నీ దైహిక వ్యవస్థలోని
ప్రతి జీవకణానికి తనదంటూ
ఓ 'మనస్సు' ఉంది.

నిన్నేది వేరుచేస్తోందో,
ఏది ప్రత్యేకతనిస్తోందో అది, ఆలోచనే.
అదే ఎల్లల్నీ, పరిధుల్నీ సృష్టిస్తోంది.
అది కనుక ఒక్కసారి లేకుండాపోతే,
నీవు హద్దులు లేనివాడివి, అపరిమితుడవు.

ఓ రకంగా చూస్తే జీవితమంతా
ఓ గొప్ప సుదీర్ఘ స్వప్నం.
నేను నీవంక చూస్తున్నాను.
కాని నీ గురించి ఏమీ తెలీదు నాకు.
ఇదంతా ఓ స్వప్నం, ఓ స్వప్నలోకం.
దీనికెక్కడా వాస్తవికత అనేది లేదు.

చూడూ, 'నీవు' అనే వ్యవస్థకు
వర్తమానం అనేది లేదు.
ఉన్నదల్లా భవిష్యత్తులోనికి చాచుకోవాలని
ప్రయత్నించే గతం మాత్రమే.

'గ్రహింపు'ను ఆశిస్తూ
మీరిక్కడికి దయచేస్తారు.
ఐతే, గ్రహించడానికేమీ లేదని
స్పష్టం చేయడమొక్కటే నా ఆసక్తి.

ఆలోచనే నీ శరీరపు వాస్తవికతను సృష్టించింది.
నీ జీవనం, నీ నిద్ర, నీ స్ఫురణలన్నిటి
వాస్తవికతను సృష్టించింది ఆలోచనే.
ఈ వాస్తవికతను నీవు జ్ఞానం ద్వారా మాత్రమే అనుభవిస్తావు.
లేకుంటే నీకో దేహం ఉందనీ, నీవు జీవించి ఉన్నావనీ,
నీవు మేలుకొని ఉన్నావనీ, నీకు నీవుగా తెలుసుకునే
మార్గమే లేదు. అదంతా జ్ఞానమే !

జీవం శుద్ధమైన, సరళమైన, భౌతిక,
దైహిక రీతిలో వ్యాఖ్యానించబడాలి.
అది అమానసికం, అమార్మికం కావాలి.

ప్రకృతి దేనినీ ఓ నమూనాగా ఉపయోగించుకోదు.
కేవలం జీవకోటిని పరిపూర్ణం చేయడం
పైననే దాని ఆసక్తి అంతా. అది పరిపూర్ణ జాతుల్ని
సృష్టించడానికి ప్రయత్నిస్తోంది కాని,
పరిపూర్ణ ప్రాణుల్ని కాదు. అది ఓ విలక్షణ వ్యక్తిని పరిపూర్ణం
చేయగానే, ఆ వ్యక్తి పరిణామ ప్రక్రియ నుండి
బయటకు తోయబడతాడు.
ఇంక అతనిపై ప్రకృతికేమీ ఆసక్తి ఉండదు.

ఈ భగవత్ స్వరూపులు,
గురువులు ..... ఈ బంట్రోతుగాళ్ళు
మనకో కొత్త ఒయాసిస్‌ను
ఇవ్వజూపుతున్నారు.
అది ఇతర ఎండమావులకన్నా
భిన్నమైనదేమీ కాదని
మీరు తెలుసుకుంటారు.

మనం మన ఉనికిని నిలబెట్టుకోవడంకోసం
నిరంతరం న్యూరాన్లను –
మన జ్ఞాపకశక్తిని ఉపయోగిస్తున్నాం.
మనం నిద్రలో ఉన్నా, కలల్లో ఉన్నా,
మెలకువలో ఉన్నా ఈ ప్రక్రియ కొనసాగుతోంది.
కాని అది మిమ్మల్ని అరగదీసేస్తోంది.
అందుచేత మానవాళి
ఈ రోజున ఎదుర్కొంటున్న విషాదం
ఎయిడ్స్, కాన్సర్‌లు కావు. అది అల్జెమీర్స్ వ్యాధి.

నీవు జీవించి ఉన్నావనీ,
నీవు మరణిస్తావనీ నిన్ను నమ్మింపజేసేది భయం.
ఈ 'భయం' అంతం కావడం మనకిష్టం లేదు.
అందువల్లనే మనం కొత్త ఆలోచనల్నీ,
కొత్త సాంకేతిక విజ్ఞానాల్నీ, కొత్త ఉపన్యాసాల్నీ,
చికిత్సల్నీ, ఎంపికలేని ఎరుక అనీ,
ఇంకా రకరకాల జిమ్మిక్కుల్ని కనిపెట్టాం.

ఉన్న భయాలన్నీ రెండే రకాలు.
ఆశించింది అందుతుందో
లేదోనన్నది మొదటి రకం.
ఉన్నది సైతం వూడ్చుకు పోతుందేమోనన్నది
రెండో రకం భయం.

ప్రకృతిలో మరణంగాని విధ్వంసంగాని లేనే లేవు.
జరిగేదేమంటే, అణువులు అటూ ఇటూ మారడమే.
ఈ ప్రపంచంలో ఎక్కడయినా శక్తియొక్క
సంతులనం నిలిపి ఉంచాల్సిన
అవసరం లేదా అవశ్యకత
ఏర్పడ్డప్పుడు మరణం సంభవిస్తుంది.

మీరు వ్యవహరిస్తున్న తీరుతో నా వివరణలను
ముడిపెట్టడం అనేది పనికిమాలిన పని.
మీరు ఈ పోల్చడాలన్నీ ఆపితే అక్కడుండేది
మీ సహజ స్థితే. అప్పుడింక మీరు ఎవర్నీ వినరు.

ఈరోజు మీరు సెక్స్‌లో పాల్గొన్నా ఇలాంటిది
('జ్ఞానోదయం' లేదా యూజీ 'విపత్తు' అని పిలిచేది)
రేపు మీకు జరుగవచ్చు. ఇంకా ఇది సెక్స్ ద్వారా
జరిగే అవకాశముంది కూడా.

అవి ఆధ్యాత్మికంగాని మరేదయినా కాని
అనుభవాలే మన దుఃఖాలకు
ప్రాథమిక కారణాలవుతున్నాయి.

నీకు ఆసక్తి ఉన్న దేనిపైనా
నీ దేహానికి ఆసక్తి లేదు.
అదే యుద్ధం నీకూ, దేహానికీ
ఎల్లప్పుడూ జరుగుతూ ఉంది.

‘సహజ స్థితి’ అకారణం.
అది యాదృచ్ఛికంగా
కలుగుతుంది. అంతే !

ఈ “ఆత్మ సాక్షాత్కారం” అనబడే దానర్థం,
సాక్షాత్కరించడానికి ఆత్మ అంటూ ఏమీ లేదని
నీకోసం నీవే స్వయంగా కనుక్కోవడం.
అది చాలా కుదిపేసే విషయం. ఎందుకంటే,
అది నీలోని ప్రతి నరాన్నీ, ప్రతి కణాన్నీ,
ఆఖరుకి నీ ఎముక మూలుగల్లోని
కణాల్నీ కూడా పేల్చివేస్తుంది కనుక.

ఇలాంటిది జరుగడానికి
ఏ సాధనా అవసరం లేదు.
ఏ పరిశుద్ధ ప్రక్రియలూ అవసరం లేదు.
ఏ విధమైన సన్నాహాలూ
చేయనవసరం లేదు.

అన్ని రాజకీయ సిద్ధాంతాలు,
ఆఖరుకి న్యాయ వ్యవస్థలు కూడా
మనిషియొక్క మతాలోచన నుండి
ఉలిపిరికాయల్లాగా ఉబికి వచ్చినవే !

ఈ ప్రాణి జీవించి ఉండేందుకు
అవసరమైనదంతా దేహంలో ఏర్పడే ఉంది.
ఈ అద్భుతమైన తెలివితో పోలిస్తే,
మేధస్సు ద్వారా సాధించి
పోగుచేసుకున్నదంతా కూడా సరితూగదు.

ఆలోచించడం మాని
జీవించడం మొదలుపెట్టు.

"జ్ఞానం కొరకే జ్ఞానం" అనబడేదేమీ లేదు.
"జ్ఞానం" అంటే "ఆధిక్యం" అని.
"నాకు తెలుసు, నీకు తెలియదు" అని.

మనుషులకన్నా కాబేజీలు
ఎక్కువ సజీవంగా ఉన్నాయి.

దేహానికి అసలు మరణం లేదు.
అది క్షణక్షణమూ జీవిస్తోంది.

ఈ దేహం ఏమీ
నేర్చుకోవాలనుకోవడం లేదు.
దాని తోవన దాన్ని వదిలేస్తే
అద్భుతమయిన తెలివిని
కలిగి ఉంటుంది.

ఓ మానవ దేహంగా
అదో అద్భుత సృష్టి.
కాని సంస్కృతి ప్రభావంతో
ఓ మానవునిగా
అతడు క్రుళ్ళిపోయినట్లే.

మానవుని సారవంతమైన
ఊహాకల్పిత వస్తువే
భగవంతుడు

నీవు జీవించి ఉన్నప్పటికంటే
మరణించిన తరువాతే
ప్రకృతికి ఎక్కువ ఉపయోగపడతావు.

మతాలు మీకు
గులాబీలను వాగ్దానం చేశాయి.
కాని మీరు కేవలం
ముళ్ళతో మిగిలిపోతారు.

మానవ దేహంలోని
ఓ విధమైన నాడీమండల లోపం నుండి
మానవ  ఆలోచన జన్మించింది.
కాబట్టి మానవ ఆలోచన నుండి
జన్మించినదేదయినా విధ్వంసకారే!

అసలు ధ్యానమే చెడ్డది.
అందువల్లనే ధ్యానం మొదలుపెట్టగానే
నీకు దుష్ట ఆలోచనలు కలుగుతాయి.

ఈ ప్రపంచాన్ని కమ్మేసిన
ఆధ్యాత్మిక, మత కాలుష్యంతో
పోలిస్తే వాతావరణ కాలుష్యం
చాలా తక్కువ హానికరం.

పరిజ్ఞానంపై ఆధారపడి
నీవనుభవించేదేదయినా భ్రాంతే!

ఓ సాధారణ వ్యక్తి
భ్రాంతుల్లో జీవిస్తాడు.
ఓ పిచ్చివాడు తన
మతిభ్రమల్లో జీవిస్తాడు.
'సహజ స్థితి'లోని వ్యక్తికి
ఆ రెండూ ఉండవు.

"సత్యం" అంటూ ఏదీ లేదు.
మీరు "సత్యం" అని పిలిచేదంతా
కేవలం మీ తర్కబలంతో
నిర్ధారణ చేసిన ప్రతిపాదికనే.

నీవొకటి, జీవం మరొకటి కాదు.
అంతా ఒకే ఐక్య కదలిక.
దాని గురించి నేనేమి మాట్లాడినా
అది మిమ్మల్ని తప్పుదోవ పట్టించడమో లేక
అయోమయంలో పడెయ్యడమో అవుతుంది.

మానవుని ఆలోచనల్లో గుణాత్మకమయిన మార్పేమీ జరుగలేదు.
గుహల కాలపు మానవుడు భీతితో తన పొరుగువాడి గురించి
ఎలా భావిస్తున్నాడో మనమూ అలానే భావిస్తున్నాము.
వచ్చిన మార్పంతా దేంట్లోనంటే, పొరుగువాడినీ,
వాడి ఆస్తులనూ ధ్వంసం చేయగల సామర్థ్యంలో మాత్రమే.

ఓ ఆలోచనగా తప్ప దేహానికి అసలు ఉనికే లేదు.
ఉన్నదంతా ఆ ఒకే ఆలోచనకు ముడిపడి ఉంది.
అదే "నేను" అనే ఆలోచన.
ఆ ఆలోచనను ఆధారంగా చేసుకుని
నీవనుభవించేదంతా భ్రమే!

మీరు భయాన్ని ప్రేమిస్తారు.
ఈ భయం ముగింపుకు రావడమే మరణం.
కనుక మీరు దాన్ని ఆశించరు.
నేను శరీర భయాన్ని తుడిచివేయడం
గురించి మాట్లాడడం లేదు.
అది జీవించి ఉండడానికి దానికా భయాలు అవసరం.
భయం మరణించడమే అసలైన మరణం.

మానవ అనుభవం మొత్తాన్నీ నీ దేహ వ్యవస్థ నుండి
బయటకు విసరివేయకపోతే,
నీవు నీ స్వంత విలక్షణత్వానికి రాలేవు.
నీ సంకల్పంవల్లనో, మరోదాని
సహాయంవల్లనో అది జరుగదు.

ఈ స్థితిలోనికి అడుగు పెట్టడానికి ఈ పవిత్రులు,
ఆధ్యాత్మిక సాధకులందరికీ కలిపి ఎంత
అవకాశముందో, ఓ హంతకునికి,
మోసగానికి లేదా ఓ రేపిస్ట్‌కు అంతే
అవకాశముంది లేదా ఇంకొంచెం
ఎక్కువ అవకాశం ఉన్నా ఆశ్చర్యం లేదు.

కొంత సాధన చేసినవారికి –
ఆలోచనని నియంత్రణలో పెట్టడానికి
ప్రయత్నించిన వారికి కొంచెం తేలిగ్గా
వివరించగలం. ఎందుకంటే,
దీని నిష్ప్రయోజనత్వం కొంతవరకూ వారికి
అనుభవమయ్యే ఉంటుంది కనుక,
వాళ్ళెక్కడ వేళ్ళాడుతున్నారో
వారు చూడగలరు కనుక!

జపమాలల్నీ, శాస్త్రాల్నీ, మీ నుదుటిపైనున్న
విభూదినీ మరచిపోండి. మీకు మీరుగా
మీ అన్వేషణలోని అసంగత్వాన్ని చూసినప్పుడు,
సంస్కృతి సమస్తం మీలో బూడిదవుతుంది.
మీరు కోరుకున్నదంతా మీ లోపల
దగ్ధమైపోవడమే ఆ బూడిద కర్థం.

రక్షింపబడాలన్న భావన నుండి
ముందుగా మీరు రక్షింపబడాలి.
మీరు రక్షకుల నుండి రక్షింపబడాలి.
ముక్తి దాతల నుండి విముక్తులు కావాలి.

ఏదయినా చేయడం, ఏమీ చేయకపోవడం
రెండూ దైన్యం అనే ఒకే ముగింపుకు చేరతాయి కనుక
నేను దేన్నీ సిఫార్సు చేయడం లేదు.
కాబట్టి ఏమీ చేయకపోవడం అనేది
ఏదైనా చేయడంకంటే భిన్నం కాదు.

నేను చెప్పడానికి ప్రయత్నించేదేమంటే,
అక్కడో వ్యక్తి అనేవాడే లేడు.
ఉన్నదల్లా, పోగుచేసుకున్న
కొంత విషయ పరిజ్ఞానం మాత్రమే కాని
అక్కడ వ్యక్తిత్వమనేదే లేదు.

మీకు సహాయపడడానికి నేనేం చేసినా
అది మీ దైన్యాన్ని ఇంకా పెంచుతుంది
తప్ప ఇంకేం కాదు. మీరింకా నా మాటల్ని
వినడం కొనసాగిస్తే, ఇప్పటికే మీకున్న
దైన్యంపై ఇంకోటి పేర్చుకున్నవారవుతారు.

మీకు 'జీవం'ని మొట్టమొదటిసారి
తాకగలిగిన ధైర్యం ఉంటే, మీకే తాకిడి
తగులుతుందో మీకెప్పటికీ తెలియదు.
మనిషి నేర్చుకున్నది, భావించినది,
అనుభవించినది – మొత్తమంతా పోతుంది.
దాని స్థానంలో ఇంకేమీ ఉండదు.

నన్నూ, నేను మాట్లాడేవాటన్నింటినీ,
గురువులందరినీ తిరస్కరించే ధైర్యం
నీకు కలిగేవరకూ ఫోటోలతో,
నియమనిష్ఠలతో, పుట్టినరోజు
పండుగలలాంటివాటితో
ఓ మతావలంబికునిగా మిగిలిపోతావు.

నేను మాట్లాడడంలో నా ఉద్దేశ్యం మీరు
ఊహించినదానికి చాలా భిన్నం.
అది మీరు అర్థం చేసుకోవడానికి నేను
సహాయపడాలన్న ఆత్రుత కాదు.
మీకు తప్పనిసరిగా సహాయపడాలని
నేను భావిస్తున్నట్లూ కాదు. అలాంటిదేమీ లేదు.
అర్థం చేసుకోవడానికి అక్కడేమీ లేదని
తేటతెల్లం చేయడంపైన మాత్రమే నా ఆసక్తంతా!

ఆధ్యాత్మిక లక్ష్యాన్ని వెంటాడడం ద్వారా
ఎట్లాగో అద్భుత రీతిలో మీ భౌతిక లక్ష్యాలను
సులువుగా నిర్వర్తించుకోవచ్చునని
మీరు అపోహ పడుతున్నారు.

నీవిప్పుడున్నట్లుగా కాక
మరోలా జీవించాలనే
అంతర్ ప్రోద్బలం ఆఖరైతే,
ఉన్న సమాజాన్ని మార్చాలనే
నాడీపరమైన ప్రోద్బలం తగ్గిపోతుంది.
అప్పుడింక సమాజపు క్రౌర్య,
దైన్యాల సమస్తంతోనూ నీవు
సమగ్ర సామరస్యతతో ఉంటావు.

నీ గురించి నీవెంత ఎక్కువ తెలుసుకుంటే,
నీవంత అణకువగా,
సున్నితంగా ఉండడం అసాధ్యం.
అసలు ఏదయినా 'తెలిసి' ఉన్నప్పుడు,
అణకువకు స్థాన మేది ?

మృత్యువే అమృతత్వాన్నీ,
ఎరిగి ఉన్నదే ఎరుగని దాన్నీ,
కాలమే కాలరాహిత్యాన్నీ,
ఆలోచనే ఆలోచనారాహిత్యాన్నీ సృష్టిస్తాయి.

సర్వసాధారణ అయస్కాంత క్షేత్రంలో
భాగమైన నిన్ను ఇతరుల నుండి
వేరు చేసేది ఆలోచనే.
నీ సంతోషం, నీ విషాదం,
నీవు వీక్షించే దృశ్యాన్ని మాత్రమే
నీవు పట్టించుకుంటావు.

నిజానికి నీవు సాయంసంధ్యని వీక్షించే మార్గమే లేదు,
దాన్నుండి నీవు వేరుగా లేవు కాబట్టి.
సాయంసంధ్య నుండి విడివడిన తక్షణం
నీలోంచి కవి బయటకు వస్తాడు.
ఇలా వేరయిన అస్తిత్వాల ద్వారా కవులూ,
చిత్రకారులూ తమను తాము వ్యక్తపరచుకోవడానికీ,
తమ అనుభవాల్ని ఇతరులతో పంచుకోవడానికీ యత్నిస్తారు.
'సంస్కృతి' అంతా అదే.

ఈ జ్ఞాపకాలు మీకు
గొప్ప భావోద్వేగ విషయాలు. నాకు కాదు.
నిన్నా, రేపు కాక ఇప్పుడు
ఏమి జరుగుతోందన్న
దానిమీదనే నా ఆసక్తి అంతా!

లైంగిక అవసరాలకై స్త్రీ,
పురుషునిపై ఆధారపడినంతకాలం
స్త్రీ వాద ఉద్యమం విజయవంతం కాలేదు.

రోగాల నుండి, దైవత్వాల వరకూ
ప్రతి అడ్డమయిన దానిపైనా
నాకు అభిప్రాయాలు ఉన్నాయి. కాని అదుగో,
అక్కడ అంట్లు కడుగుతూ
వంట చేస్తున్న పనిమనిషి అభిప్రాయాల్ని
మించి వాటికే ప్రాముఖ్యతా లేదు.

నేను చెప్పదలచుకున్నదంతా ఏమంటే,
మీరు సగర్వంగా ప్రదర్శించుకునే
ఈ విజ్ఞానమంతా కూడా, మాట్లు వేసేవాడి
అడ్డదిడ్డపు పనుల పాటి చేయదు.

ప్రేరేపణ (ఇన్‌స్పిరేషన్) అనేది
ఓ అర్థంలేని విషయం. ఓడిపోయినవాళ్ళు,
ఇంకే ఆశా లేనివాళ్ళే,
ఈ ప్రేరేపణకు గిరాకీ కల్పిస్తారు.
ప్రేరేపిత చర్యలన్నీ నిన్నూ,
నీలాంటివారినీ నాశనం చేస్తాయి.

దేన్నయినా, ఎవర్నయినా ఉపయోగించుకుని
సుఖం పొందడం అనేది ఘోరమయిన విషయం.
ఓ భావాన్నో, ఓ సిద్ధాంతాన్నో,
ఓ మందునో, ఓ వ్యక్తినో –
ఏదో దాన్ని ఉపయోగించందే
మీరు సుఖాన్ని పొందలేరు.

బాధ్యతాహీనుల్ని, సంఘ వ్యతిరేకుల్ని
సృష్టించిన ఈ సమాజమే వాళ్ళ నుండి
తన్ను రక్షించుకోవడంకోసం నైతికతని
సృష్టించుకొంది. సమాజమే
ఋషుల్ని సృష్టించింది, పాపుల్నీ సృష్టించింది.
వాళ్ళు అదే కోవకి చెందిన
వాళ్ళుగా నేనంగీకరించను.

విలక్షణత అనేది
ఓ కర్మాగారంలో తయారయ్యేది కాదు.
సంస్కృతీపరమైన పరిశీలనా కేంద్రం లేని
ఓ నిజమైన వ్యక్తి తాను ఓ విలక్షణ
వ్యక్తినని ఎప్పటికీ తెలుసుకోలేడు.

ఆలోచనల ఉక్కు పిడికిలి నుండి
ఈ జీవ వ్యవస్థ ఒక్కసారి విడుదలయితే,
ఇంక అక్కడ శాంతినీ,
సామరస్యాన్నీ తీసుకువచ్చే
ప్రయత్నమేమి చేసినా అది విషమత్వాన్నీ,
హింసనీ సృష్టిస్తుంది.

సత్ జీవనానికి అవసరమైన అసాధారణ
ప్రజ్ఞ అంతా ఈ సజీవ శరీరానికి ఉంది.
కాని, మనం ఎల్లప్పుడూ
దాని సహజ ప్రక్రియలో ఆలోచన
అనే సాధనం ద్వారా జోక్యం చేసుకుంటున్నాం.

మీరు ఏమైనా తెలుసుకోవాలంటే
అన్నింటినీ పక్కకు తుడిచెయ్యాలి.
మీ సమస్య అంతా ఎవరి నుండి, ఏది,
ఎలా పొందలా అని కాదు.
ఎవరు ఏది ఇవ్వజూపినా,
ఆ మొత్తాన్ని తిరస్కరించడం ఎలాగన్నదే !

ముందు తప్పనిసరిగా మరణం
('నేను' అనేదాని మరణం, తద్వారా జరిగే
దైహిక మరణ ప్రక్రియ) చోటు చేసుకోవాలి.
తరువాతే యోగం మొదలవుతుంది.
వాస్తవ మరణం నుండి తన్ను తాను
వెనక్కి తెచ్చుకొనే దేహకౌశల్యతే యోగా.

నీ చుట్టూ ఉన్నదంతా ఆలోచనా జనితమేనని
మరచిపోయావు. అసలు నువ్వే
ఆలోచన నుండి పుట్టావు.
లేకుంటే నీవిక్కడ ఉండే వీలే లేదు.
ఆ దృష్టితో చూస్తే ఆలోచనకు
అద్భుతమయిన విలువ ఉన్నట్లే.
అయినా నిన్ను నాశనం చేసేది కూడా అదే !

మానవ చైతన్యపు ఉనికిని కనుక్కోవడానికి
మీరు కోట్లు కోట్లు ఖర్చుచేసి పరిశోధనలు చేయవచ్చు
కాని అసలు మానవ చైతన్యానికి
నిర్దిష్ట స్థానం అనేదే లేదు.
అసలు ఏ ఒక్క వ్యక్తిలో కూడా స్థానం అనేది లేదు.
ఉన్నదల్లా ఆలోచన మాత్రమే!

సంస్కృత పదం 'మాయ'కు అర్థం,
ఆంగ్లంలో 'భ్రాంతి' (ఇల్యూషన్) అనే మాటని
ఏ అర్థంలో వాడుతామో ఆ అర్థంలో కాదు.
'మాయ' అంటే కొలవడం.
దేన్నయినా కొలవాలంటే నీకో స్థానం ఉండి తీరాలి.
కనుక, కేంద్రం లేకుండాపోతే చుట్టుకొలతలుండవు.
ఇది శుద్ధ, సామాన్య, ప్రాథమిక గణితం.

అసలు చూసేవానికి ఉనికి లేదు.
చూడబడే వస్తువే చూసేవాడిని సృష్టిస్తోంది.
ఇది భారతీయ తాత్వికాలోచన
మొత్తానికీ వ్యతిరేకం.

జీవించి ఉన్నప్పుడు అక్కడున్న
జ్ఞానమేదీ మీది కాదు. కాబట్టి,
'నేను' అని మీరు పిలుచుకునేది
పోయిన తరువాత ఏమి జరుగుతుందనే
దాన్ని మీరెందుకు పట్టించుకుంటారు ?

మీ మనసు, నా మనసు అనేవేమీ
వేర్వేరుగా లేవు.
పేరుకున్న జ్ఞానం,
అనుభవాలన్నీ ఎక్కడ నిల్వపడి
తరం నుండి తరానికి
సంక్రమింపబడతాయో అలాంటి
ఓ 'ప్రపంచ మనస్సు'
ఉండి ఉండవచ్చు.

జ్ఞానోదయం అనేటటువంటిదేదయినా జరిగితే,
అది తమ వెతుకులాటను పూర్తిగా,
సమగ్రంగా వదిలేసుకున్నవారికే జరిగింది.
అలాంటిది జరగడానికి
ఇదో ఖచ్చితమైన అవశ్యకత.

ఉన్నత కేంద్రాలు, చక్రాల గురించి
మాట్లాడకండి. మానవ దేహాన్ని
నియంత్రించేవి గ్రంథులే కాని అవి కావు.
ఈ దేహం పని చేయడానికి
ఆదేశాలిచ్చేవి ఈ గ్రంథులే!

మీరు దౌర్జన్యం ద్వారా
శాంతిని రుద్దాలని ప్రయత్నిస్తున్నారు.
యోగా, ధ్యానం, ప్రార్థనలు, మంత్రాలు
అన్నీ దౌర్జన్యపు పద్ధతులే. మీరేమీ చేయనక్కర్లేదు.
సజీవ ప్రాణి చాలా శాంతివంతమైనది.
మీ పారవశ్యాలు, దివ్యానందాలు లేక
బ్రహ్మానంద స్థితులు ప్రశాంతంగా
వ్యవహరిస్తున్న దేహానికేమీ పట్టవు.

ఆలోచన ఎప్పటికీ జీవం యొక్క
కదలికను ఒడిసిపట్టలేదు.
ఆలోచన చాలా చాలా నిదానం.
ఇవి ఉరుము, మెఱుపుల్లాంటివి.
రెండూ ఒకేసారి జరుగుతాయి.
కాని శబ్దం కాంతికన్నా తక్కువ వేగంతో ప్రయాణించి,
మిమ్మల్ని ఆలస్యంగా చేరుకుని,
అవి రెండూ వేరువేరు ఘటనలనే
భ్రాంతిని కలుగజేస్తాయి. ఇదీ అంతే!

నేను మామూలుగా
చెప్పదలచుకున్నదేమంటే,
మీ ఆధ్యాత్మిక, మత వ్యవహారాలన్నీ
మౌలికంగా స్వార్థపరమైనవే!

ఒకటిమాత్రం నాకు స్పష్టం.
నీవేమిటో స్వయంగా
తెలుసుకోవాలనుకుంటేమాత్రం,
ఖచ్చితంగా ఇంకెటూ తిరగలేని
నిస్సహాయ స్థితికి నీవు రావల్సిందే.
సహాయంకోసం నీవు లోనా,
బయటా ఏ మూలాల వైపు తిరిగినా
అదంతా ఉత్త పనికిమాలిన వ్యవహారమేనని
నాకు నిశ్చయంగా తెలుసు.

నీ వేరుపడిన వ్యక్తిత్వాన్ని
కొనసాగించడం కోసం,
ఆలోచనని నిరంతరాయంగా
వినియోగించడమే 'నీవు'.
నీ లోపల అది తప్పించి మరేమీ లేదు.

సమాజం సంఘర్షణ పునాదిపై నిర్మింపబడింది.
నీవే ఆ సమాజం కనుక
నీకు ఎల్లప్పుడూ సమాజంతో ఘర్షణ తప్పదు.

ఎప్పుడయితే నా దేహం పాతిపెట్టబడుతుందో,
ప్రజలకున్న నా తాలూకు జ్ఞాపకాలు కూడా
దానితోపాటే పాతిపెట్టబడతాయి.
అదే నాకు అంతం.

ఎవరినయినా ఉపయోగించుకోవడం,
ప్రభావితం చేయడం లేదా మార్చాలనుకోవడాలపై
నాకు ఆసక్తిలేదు. నేనేమిటి, ఎలా జీవించానన్న దానిపై
ఇదో ప్రకటన తప్పించి మరేమీ కాదు. మానవజాతికి దీనివల్ల
ఏ అద్భుతమయిన విలువా కలుగబోదు. ముందు తరాలకు
దీన్ని దాచి ఉంచాల్సిన అవసరమూ లేదు.
ముందు తరాల కోసం దాయడం అనేదాన్ని నేను నమ్మను.

మీ అందరికీ 'ఏలిస్ ఇన్ వండర్‌లాండ్' కథ తెలుసు.
దానిలో 'రెడ్ క్వీన్' తానున్నచోట స్థిరంగా
ఉండడానికి ఇంకా, ఇంకా వేగంగా
పరిగెత్తాల్సి ఉంటుంది. మీరందరూ
ఖచ్చితంగా అదే చేస్తున్నారు.
ఇంకా, ఇంకా వేగంగా పరిగెత్తుతున్నారు,
కాని మీరెక్కడికీ ముందుకు కదలడం లేదు.

ఆ నలిగిన దారి
నిన్నెక్కడికీ తీసుకుపోదు.
కనుచూపుమేరలో ఒయాసిస్ ఏదీ లేదు.
ఎండమావిలో ఇరుక్కుపోయావు.

సహజ స్థితి అంటే గొప్ప సున్నితత్వ స్థితి.
అది ఇంద్రియాల భౌతిక సున్నితత్వమే
కాని ఇతరుల పట్ల భావపరంగా
దయగానో మృదువుగానో ఉండడం కాదు.
నాకు 'ఇతరులు' లేరు కనుక,
'వేరు' భావన లేదు కనుక,
ఆ అర్థంలో అక్కడ దయ అనేది ఉంటుంది.

ఇక్కడున్నదేమంటే జీవంతో
తొణికిసలాడే సహజ స్థితి.
ఇది నాచే బంధింపబడదు, మీవల్లా కాదు.
ఇది ఓ పూవు వంటిది. పూ పరిమళాన్ని
మీరు నిలువ చేయలేరు.
మీరు నిలువ చేయగలిగేది కేవలం
సింథటిక్, రసాయన పరిమళాన్నే తప్పించి,
జీవంతో ఉన్నదాన్ని కాదు.

సహజస్థితి అంటే ప్రశ్నించడం ఆగిపోయిన
స్థితి. ఆ ప్రశ్నలకూ, ఈ సజీవ దేహం
వ్యవహరించే తీరుకూ సంబంధం లేదు
కనుక, ఈ సజీవ దేహం వ్యవహరించే
తీరులో ప్రశ్నలకు స్థానం లేదు కనుక
ప్రశ్నించడం ఆగిపోయింది.

జ్ఞానం అనుభవాన్నిస్తుంది.
అనుభవం జ్ఞానాన్ని బలపరుస్తుంది.
ఇదో విష వలయం.

గురువులందరూ అనుయాయులకు
చిల్లర అనుభవాలు కలుగజేసే సంక్షేమ సంస్థలు.
ఈ గురువుల క్రీడ ఓ లాభదాయక పరిశ్రమ.
సంవత్సరానికి ఓ రెండు మిలియన్ల డాలర్లు
ఇంకోలాగ ఎలా సంపాదిస్తారో
ప్రయత్నించి నాకు చూపండి.

తాను మీకు సహాయపడగలనని
ఎవరైనా అనుకుంటే, అతడు తప్పకుండా
మిమ్మల్ని తప్పుదోవ పట్టిస్తాడు.
అతనెంత తక్కువ మోసగాడుగా ఉంటే,
అతనెంత ఎక్కువ శక్తివంతుడైతే,
అతడెంత ఎక్కువ జ్ఞానవంతుడైతే,
మీకంత ఎక్కువ దైన్యాన్నీ, హానినీ కలుగజేస్తాడు.

నాకు జరిగినట్లు, జీవపరమైన సమూల మార్పుకు
మీరు గురవ్వండే మీ వాస్తవ సమస్యలకు
ఏ విధమైన పరిష్కారం సాధ్యం
కాదని నేననుకుంటున్నాను.

భాషతో వచ్చిన సమస్య ఏమిటంటే, మనమెంతగా
మనల్ని వ్యక్తపరచుకోవడానికి ప్రయత్నించినా పదబంధాల్లో
ఇరుక్కుపోతాం. దేనినయినా వ్యక్తం చేయడానికి
కొత్త భాషనో, కొత్త శైలినో సృష్టించడంలో అర్థం లేదు.
ఆలోచన యొక్క ఉడుంపట్టు నుండి నిన్ను
నీవు విడుదల చేసుకోవడమనే విషయం తప్ప
వ్యక్తం చేయడానికేముందక్కడ?

మోక్షం, స్వేచ్ఛ, వికాసం, సమూలమైన మార్పు –
మీరు ఏ పేరు పెడితే అది – క్షణమాత్రమైనా
విచారం లేని సంతోషం, బాధల్లేని సుఖం –
ఈ రెంటిలో మీరు దేనిపట్ల ఆసక్తులయి ఉన్నా,
రెండూ ఒకటే!

మనసు ఎల్లప్పుడూ
లోనికి మూసుకుని ఉంటుంది.
మనసు అక్కడున్నంత కాలం, విషయాల్ని
అర్థం చేసుకోనీయకుండా
అదే మీకు అడ్డుపడుతుంటుంది.

ప్రశ్నించేవాడే "సమాధానాలు". సమస్య అంతా అదే.
కాని మనం దీన్ని అంగీకరించడానికి సిద్ధంగా లేము.
ఎందుకంటే మనం తరతరాల నుండి
నిజమైన సమాధానాలుగా అంగీకరించిన వాటికి
ఈ సమాధానం ముగింపు పలుకుతుంది కాబట్టి.

మీరే నన్ను సృష్టించారు.
నేను మిమ్మల్ని సృష్టించలేదు.
కారణం సాధారణమే!
నేను అనే స్వంత రూపం నాకు లేదు కదా!

మనం దేని వంకా చూడం.
ఆ చూడడం ప్రమాదకరం. ఎందుకంటే,
ఆ "చూడడం" అనేది ఆలోచించడం లోని
నిరంతరతను నాశనం చేస్తుంది.

ఓ భగవత్ స్వరూపుడు రంగం పైకి దిగినప్పుడల్లా
ఉన్న గందరగోళాలకు మరికొంత
జోడిస్తున్నాడు. మనం నిదానంగా
స్వీయ వినాశనం దిశగా కదులుతున్నాం.

నేను మాట్లాడే 'సంపూర్ణ అరాచకత్వ'
మనేది ఓ అస్తిత్వ స్థితే గాని,
క్రియాశీల స్థితి కాదు.
అక్కడ ఆచరణ ఉండదు.
ఆ స్థితి నుండి ఏదయినా
నూతనమయింది జన్మించవచ్చునేమో.

విప్లవాలన్నీ, మన విలువల చట్రాలకు
తిరిగి విలువ కట్టడం తప్పించి మరేమీ కాదు.
మీరు కేవలం ఓ వ్యవస్థ స్థానంలో
మరో వ్యవస్థని నిలబెడుతున్నారంతే.

మీరు 'నేను'గా తలచేదంతా
భయమే.
ఆ 'నేను' భయం నుండి పుట్టింది.
భయంలో జీవిస్తుంది.
భయంతో వ్యవహరించి,
భయంలోనే మరణిస్తుంది.

ఈ దేహం ప్రకృతిచే సృజించబడిన ఓ సమగ్రశకలం.
ఈ భూమి మీద మానవ జీవుల కూర్పుల్లో ఓ శకలానికి
'ఐన్‌స్టీన్' మేథస్సు ఇవ్వబడింది.
మరో దానికి టైసన్ కండలూ,
ఇంకోదానికి మార్లిన్ మన్రో అందమూ
సంక్రమించాయి. అన్నీ ఒకే వ్యక్తిలో వికసించే
అవకాశాలు నేనూహించలేను.

దేశాంతర, ఖండాతర పర్యటనలు కొన్ని భ్రమల్ని ధ్వంసం
చేసి మరికొన్ని కొత్త భ్రమల్ని సృష్టిస్తాయి.
నేను కనుక్కున్నదేమంటే - దిగులుతో చెప్తున్నాను -
రష్యన్స్ కానీండి, అమెరికన్స్ కానీండి, ఎవరయినా,
ఏ ప్రాంతం వారయినా కానీండి -
మానవ స్వభావం అంతా,
అందరిదీ ఖచ్చితంగా ఒకేలా ఉంటుంది.

ఆలోచనలు మన లోపలున్నాయని అనుకుంటాం.
అవి వాటంతట అవే జన్మిస్తాయనీ,
వాటంతట అవే ఏర్పడతాయని అనుకుంటాం.
వాస్తవంగా అక్కడున్నది ఓ 'ఆలోచనల ఆవరణం'.
అది తరతరాల నుండి మనకి సంక్రమించిన
మానవ అనుభవాల, ఆలోచనల, భావాల సమిష్టి ఆవరణం.

ఆలోచన నుండి పుట్టిన ప్రతిఒక్కటి –
ఇప్పటివరకూ మీరు కనిపెట్టిన ప్రతిదీ కూడ విధ్వంసక
ప్రయోజనాలకే ఉపయోగపడ్డది.
మనం కనిపెట్టే ప్రతిదీ,
ప్రతి నవీనావిష్కరణా మానవజాతుల్ని
సమూలంగా తుడిచిపెట్టే
దిశగానే తోసుకువెళ్తోంది.

నా మాటలు సినికల్‌గా అనిపించవచ్చు.
కాని నిజానికి 'సినిక్' అంటే 'వాస్తవవాది' అని అర్థం.
సినిసిజమ్ ప్రపంచంలో జరుగుతున్న విషయాల్ని
ఆరోగ్యకరమైన ధోరణిలో చూడడానికి సహాయపడుతుంది.

చచ్చిన గతం నుండి సమాధానాలను పొందడానికి
ప్రయత్నించినంతకాలం మనకు భవిష్యత్తు లేదు.
"వెనక్కి చూడండి" లేదా "వెనక్కి మళ్ళండి"
అనేవాళ్ళ దగ్గర మనకివ్వదగ్గ
సమాధానాలేవీ ఉండవు.

వాస్తవమేమిటంటే స్వేచ్ఛగా
ఉండడం మనకిష్టం లేదు.
మనకున్నదాన్ని, మనం ఎరిగినదాన్ని
కోల్పోతామన్న భయమే మన
సమస్యలకు కారణమవుతోంది.
ఈ చికిత్సలూ, ఈ ప్రక్రియలూ -
మతపరమైనవి గాని, వేరేవి గాని,
మానవ వేదనని ఇంకా స్థిరపరుస్తున్నాయి.

మనం భయం నుండి
బయటపడాలని కోరుకోం. మనం కోరేదల్లా,
దానితో ఆటలాడుకోవడం,
దాని నుండి మనల్ని బయటపడేసుకోవడం
గురించి మాట్లాడుకోవడం.

విసుగుదల (బోర్‌డమ్) అనేది
ఓ అడుగులేని గొయ్యి.
ఇప్పుడు నీవు చేస్తున్నదానికంటే
ఎక్కువ ఆసక్తికరంగా, ఎక్కువ ప్రయోజనకరంగా,
ఎక్కువ అర్థవంతంగా చేయదగ్గది
మరేదో ఉంటుందని భావించినంతకాలం,
నిన్ను నీవు, విసుగుదల నుండి
బయటపడేసుకునే మార్గమే లేదు.

పిల్లలకు వాళ్ళెలా ప్రవర్తించాలో,
ఎలా వ్యవహరించాలో,
ఎలా జీవించాలో నేర్పడానికి
ప్రయత్నించే బదులు
వాళ్ళనుండి నేర్చుకోవడం
ఆసక్తికరంగా ఉంటుంది.

ఓ చర్చ లేదా సంభాషణ యొక్క పరమ ప్రయోజనమేమంటే,
అవతలివాళ్ళని నీ అభిప్రాయానికి అనుగుణంగా మార్చడం.
అసలు నీకో దృక్పథం అంటూ లేకపోతే ఎవరూ నిన్ను తమ
అభిప్రాయాల కనుగుణంగా మరల్చడం గాని,
ఒప్పించడం గాని జరుగదు.

ఆలోచన అన్నిచోట్లా అడ్డుగోడల్ని నిర్మిస్తుంది.
అట్లా అడ్డుగోడల్నీ, భేధాల్నీ కల్పించే
ఆలోచనే వేరువేరు దృక్పథాల్ని కలిపే సాధనం కాలేదు.
అది ఓ వృధా ప్రయాస.

ఈ శతాబ్దపు అతి పెద్ద జోక్ ఐక్యరాజ్య సమితి.
ప్రతి ఒక్కరూ తమ తమ హక్కులను
బలపరచుకుంటుంటే,
ఇంక ఐక్యరాజ్యా లెక్కడుంటాయక్కడ ?

ఆలోచన సమస్యల్ని మాత్రమే
సృష్టిస్తుందని నమ్మడానికి మనం సిద్ధంగా లేము.
ఆ సాధనం మనకేవిధంగానూ సహాయపడలేదు.

స్థల కాల పరిమితుల్లో సంభవించేదంతా
'జీవశక్తి' ని పరిమితం చేస్తోంది.
ఆ 'జీవశక్తి' ఏమిటంటే నాకు తెలీదు.
ఎప్పటికీ తెలియదేమో !

శారీరకమైన సహజాతం చాలా శక్తివంతమైనది.
బహుశా, ప్రేమ, కరుణలు కాక
నశిస్తామేమోనన్న భయమే
మానవజాతిని రక్షిస్తున్నదనుకుంటా !

ఆలోచన దాని జన్మరీత్యా,
స్వభావరీత్యా, వ్యక్తీకరణరీత్యా
చాలా 'నియంత'.
నేనీ మాటని రాజకీయార్థంలో కాక
మన యోచనల్నీ, చర్యల్నీ అది
నియంత్రిస్తుందనే
అర్థంలో అంటున్నాను.

నీవింక చేతులెత్తేసి అన్నీ
వదులుకోవాలన్న వాస్తవాన్ని
అంగీకరించడానికి సిద్ధం కాలేదు.
అది సమస్తంగా, సంపూర్ణంగా లొంగిపోవడం.
ఇంకే మార్గమూ లేదని చెప్పే
ఆశారహిత స్థితి అది. ఏ దిశగానైనా,
ఏ పరిమాణంలో అయినా,
ఏ స్థాయిలోనైనా, ఏమాత్రం చలనం ఉన్నా అది,
నిన్ను నీ నుండి దూరం చేస్తుంది.

'స్వార్థంతో ఉండు,
స్వార్థంలో నిలిచిపో"
అనేది నా సందేశం.
ఆత్మసాక్షాత్కారం
పొందాలనుకోవడం స్వార్థం.
దాతృత్వం కూడా స్వార్థమే.

మార్మికుడనీ, పిచ్చివాడనీ
విభజించే గీత చాలా పలుచనిది.
ఈ పిచ్చివాడు
చికిత్స అవసరమైన వాడయితే,
ఆ మొదటివాడు
అదే తోవలోకి రాబోతున్నవాడు.

ఈ క్షణం అనేది బంధించ వీలుకానిది,
అనుభవించ వీలుకానిది,
వ్యాఖ్యానించ వీలుకానిది.
ఓ క్షణాన్ని బంధించగానే దాని గురించిన
యోచనతో దాన్నప్పటికే గతంలో భాగం చేసేస్తావు.

ఎల్లప్పుడూ ఆలోచన అనేది లేకుండా పోతే,
మిగిలేది క్షణక్షణమూ జీవించటమే.
అదంతా సినిమా భాషలో చెప్పాలంటే
కోట్ల కోట్ల ఫ్రేముల్లో (Frames) ఉంటుంది.

శాంతా కెల్కర్, యూజీల సంభాషణ ఆమె మాటల్లో -
"ముళ్ళపైన నడవడానికేమయినా బూట్లున్నాయా?" అనడిగితే
ఆయన సమాధానం పదునుగా, సూటిగా వచ్చింది
"అసలు ముళ్ళే లేవు" అంటూ.
నేను సంతృప్తి చెందక
"నాకు మాత్రం ఖచ్చితంగా ముళ్ళున్నాయి" అన్నా!
"గులాబీల కోసం వెతకడం ఆపితే, ముళ్ళుండవు"
అంటూ ఓర్పుగా ఆయన సమాధానమిచ్చారు.

నా ధ్యేయం అనేది ఏదైనా ఉంటే,
అది నేనింతవరకు చేసిన ప్రతి
వాంగ్మూలాన్నీ చిత్తు చేయడమే.
నా మాటల్ని గాఢంగా తీసుకుని
ఉపయోగించాలనో లేదా
ఆచరించాలనో ప్రయత్నిస్తే మాత్రం
ప్రమాదంలో పడతారు.

ప్రశ్నలన్నింటికీ సమాధానమొక్కటే
'ప్రశ్నించడం మానండి !'

# చలం ఉత్తరాల్లో యూజీ ప్రస్తావనలు

తేది : 22-1-1971

చంద్రశేఖర్,

"U.G.K. వేటికి విరోధో వాటన్నిటినీ, నేను పుస్తకాలలో ఖండించానని నువ్వూ నురిచావా? ఆయనతో శిష్యులు వాదిస్తున్నారు. నన్ను వాదించడానికి కూడా అయోగ్యుడినని వొదిలేశారు. వెలివేశారు. ఎందుచేత? ఆలోచించు. జిడ్డు కృష్ణమూర్తిగారి మాటలూ, ఈయన (U.G.) మాటలూ చాలా బావుంటాయి. కాని ఆస్థితికి పోవడమెట్లా? అందుకున్నవాళ్ళు హాయిగా మాట్లాడుతారు. నిముషమైనా ఆ మాటల్ని జీవించలేక తన్నుకుంటో వుంటాం నా బోటి వాళ్ళం".

"ఈసారి నేను వొస్తే ....." అని రాశావు.

"ఈసారి నేను వొస్తే కద – " అని రాయలేదు. ఏమో ఎవరికి తెలుసు? నీ next letter Switzerland నించి వొస్తుందేమో!

కాని నాకు mushrooms ఎవరు పంపుతారు?

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

---

తేది : 15-1-1971

చంద్రశేఖర్,

"చాలా గొప్పగా వుంది U.G.K. తో నీ స్నేహం. ఇట్లాంటివి చదివినప్పుడల్లా, విన్నప్పుడల్లా నేను అక్కడ వుండలేకపోతినే అని ఆశపడతాను.

నేను కాక ఈ లోకంలో పెళ్ళికీ, చదువుకీ విరోధులున్నారంటే నాకెంత బలంగా వుందో! ఇంతవరకు చదువులకి విరోధులున్నారు. పెళ్ళికి విరోధులున్నారు. రెంటికీ విరోధులు ఎందరో లేరు. ఒకప్పుడు ఈ లోకపు V.I.P. ల మాటల్ని విని నాకేమన్నా అన్యాయపు prejudices ఏమో అని సందేహపడేవాణ్ని.

'సరేలే. తొందరేముంది? నీకు వీలైనప్పుడే రా! గొప్ప గురువు సన్నిధానం కన్న, ఆయన మైత్రి కన్నా కావలిసిందేముంటుంది?'

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

తేది : 4-1-1973

చంద్రశేఖర్,

నీ ఉత్తరం చూసి చాలా సంతోషించాము. నాకు అలాంటి experience లేకపోయినా వొక saint ప్రేమ మన level కి దిగి వొచ్చి మనతో intimate గా కలిసి వుంటే, ఆ రోజులు ఎంత గొప్పగా గడుస్తాయో నేను picture చేసుకుంటున్నాను.

షౌతో మేం ఇక్కడ వుంటున్నామంటే ఇక్కడ మా relationship - they lack proper perceptive. They suffer too much loving familiarity.

ద్వారకలో శ్రీ కృష్ణుడు అట్లానే మాయపుచ్చేవాడనుకుంటా, తానెవరో తెలియకుండా I wish you could record your nights and days with U.G. ఆ perspective తెచ్చుకోవడం కష్టమేమో .....

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

---

తేది : 6-1-1973

చంద్రశేఖర్,

యూజి రాయమన్నారంటే ఆ రాసే శక్తి కూడా ఆయనే ఇస్తారన్నమాట. ఆ శక్తిని ఇచ్చేవరకు wait చెయ్యి. భగవాన్ అట్లానే ఇచ్చేవాడుట. షౌ ఆ శక్తుల నిచ్చి ఎట్లాంటి పుస్తకాలు రాయించిందో చూడు.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

---

తేది : 10-1-1973

చంద్రశేఖర్,

నీ ఉత్తరం చాలా వుత్తేజకరంగా వుంది. నువ్వు ఏమీ సంశయించకు. వెనకాడకు. నీచేత ఓ గొప్ప పని చేయించ తలుచుకున్నారు ఈశ్వరుడు (U.G.). నువ్వల్లా వో instrument గా వుంటే చాలు. షౌ నీకీ suggestion ఇస్తోంది. 'నువ్వల్లా ఆయన్ని ఆ mood లో పెట్టి ఆయన ముందు tape పెట్టి record చేయడం అది ఏ భాషలో ఐనా, ముఖ్యమైన పని'.

ఆ రికార్డు తయారైతే తక్కిన సంగతులు యోచించుకోవచ్చు. నా idea

ఏమిటంటే 'day to day with Bhagawan' 'పరమహంస దినచర్య' 'M' రికార్డు చేసినట్లు అక్కడ ఏం జరుగుతున్నది నువ్వు రికార్డు చేయడం day after day. ఇది కష్టతరమైన పనే. నేను ఇట్లాంటిది చేయాలి శ్రీ రమణస్థాన్‌లో అని ప్రయత్నించాను. కానీ నాకు సాధ్యం కాలేదు. ఇట్లాంటి పనులు పైనించి orders వొస్తే గాని నా బోటి నీ బోటి సాధారణ మానవులకి సాధ్యమయ్యే పనులు కావు. సరే, వీటిలో గొప్ప relief ఏమిటంటే ఇవి మన చేతిలో లేని పనులు కాబట్టి మనం చేయకపోతిమే అనే regret వుండదు.

U.G. చెప్పిన Title బావుంది చాలా. ఆయన తల్చుకున్నారంటే కాని పని ఏది? I feel we are at the brink of exciting times. కానీండి. మీ వెంట మేమూ గంతులు వేస్తూ వుంటాం ఇక్కడి నించి.

P.S. అక్కడ నీవు చేయవలసిన పని పూర్తి కాగానే దాంతో నిన్నిక్కడికి రమ్మంది షౌ. అన్నివిధాలా నీకు తన support వుంటుందని చెప్పింది షౌ. షౌ వెనుకే చలం వున్నాడు.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

---

తేది : 23-10-1973

చంద్రశేఖర్,

U.G. తో ఉన్న ఉత్సాహమన్నా కనబడటం లేదు నీ ఉత్తరాలలో. ఆయనకి జబ్బుగా వుండడంవలనా? సంతోషంగా వుండడం లేదా ఆయన? వైద్యాలన్నీ ఐపోయి ఆయన వొళ్ళు ఇంకా బావుండకపోతే నా పిచ్చి వైద్యానికి కూడా try చేయమని చెప్పకూడదూ?

ఆయన 'చలం' పుస్తకం చదువుతున్నారా? నువ్వు చదివి వినిపిస్తున్నావా? ఆయన దృష్టి పడవలసినంత అర్హత వుందా ఆ పుస్తకానికి గాని, ఆ జీవితానికి గాని? ఆయన comments వినే అదృష్టం నాకు లేకపోయింది. ఆయన్ని చూడాలని చాలా వుంది. సరేలే. టైం రానీ.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

తేది : 6-12-1973

చంద్రశేఖర్,

యూజీకి రమణస్థాన్ సంగతి ఏం తెలుస్తుంది? నువ్విచ్చిన గొప్ప రిపోర్టే కదా ఆయనకి ఆధారం. ఆయన రమణస్థాన్ని అంత గొప్పగా మెచ్చుకుంటున్నారంటే నాకెంతో గర్వంగా వుంది. ఇదంతా షా నిర్మాణమనుకో. అయినా, నాకు కూడా I have not lived in vain అనిపిస్తోంది.

---

తేది : 14-12-1973

చంద్రశేఖర్,

'యూజీకి మా బోటి వాళ్ళందర్నీ reform చేయడం కన్నా ఏం పని వుంది? అందుకే కదా ఈ లోకంలోకి వొచ్చింది.'

---

తేది : 1-11-1973

చంద్రశేఖర్,

నీ ఉత్తరం జీవితం మీద ఉత్సాహం అప్పుడే పోవడమేమిటి? ఈ నాటికీ నేను అన్ని planes లోనూ thrill ఔతోనే వున్నాను. నువ్వూ ఔతావు. U.G. దగ్గర వుండగా thrills కి ఏం తక్కువ?

అవును. చివర్లో 'U.G. క్షమించండి' అని రాశాను. U.G. జీవితం మొదట్లో నువ్వు 'మోక్షము కలదా భువిలో' అని రాశావు చూడు. ఆయన మోక్షమే లేదంటూంటే, నేనేదో మోక్షం ఉందని రాస్తున్నాను. దానికి 'క్షమించండి U.G.' అన్నాను. దాంట్లో మీకు కనబడ్డ అర్థంలో కూడా గొప్ప అర్థం వుంది.

ఈ అర్థం చూడు పోనీ. ఈశ్వరుడు ప్రపంచంలో బంధితుడైనాడు. ఆ బంధ విముక్తి ఐతేనే గాని ఈశ్వరుడికి మోక్షం లేదు. ఆ బంధ విముక్తి కోసమే జీవాత్మ ప్రతి జీవిలోని ఆత్మ అట్లా కొట్టుకుంటూ వుంటుంది.

అవును. ఏ వైద్యమూ U.G. ని treat చేయలేదని మాకు తెలుసు. కాని కొన్ని వైద్యాలకి submit అవుతున్నారని తెలిసింతరవాతే ఆ వుత్తరం రాశాను. ఆయన్ని కుదర్చలేకపోయినా ఆయన్ని treat చేసే భాగ్యం కొందరికి ఇస్తున్నారు.

ఆ వైద్యుల list లో మమ్మల్ని కూడా చేర్చుకోరాదా? అని రాశా!

సరే. అందర్నీ తన మీద experiment చేసుకోనిస్తున్నారు కదా. మమ్మల్ని కూడా చేసుకోనీయరాదా? అని అడుగుతున్నా.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

---

తేది : 5-6-1975

చంద్రశేఖర్,

ఎన్నాళ్ళకో నీ నుంచి హృదయపూర్వకమైన ఉత్తరం.

నా ఉత్తరమో, సుగుణ జబ్బో నీ జీవితాన్ని పర్యాలోచనలో పడేసింది. నీవంటి ఉత్తముడి జీవితంలో అట్లాంటి పర్యాలోచనలు అనేకసార్లు రాక తప్పవు. నేను వెళ్ళిపోతున్నాను. ఆ లోకపు పరిస్థితులు నాకు తెలియవు. వీలుంటే అప్పుడప్పుడు నిన్ను చూస్తూనే వుంటాను.......

..... యూజీ నిన్నెన్నటికీ వొదలరు. నాకెక్కడ దొరికావు బాబూ. నన్ను వొదులు అన్నా వొదలరు. అదృష్టవంతుడివి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

(ప్రముఖ రచయిత చలం శ్రీ కొర్లిమర్ల చంద్రశేఖర్ గారికి వ్రాసిన ఉత్తరాల నించి)

❄❄❄



యూజీ ఆఖరి రోజుల్లో (వాలెక్రోసియా, ఇటలీ)

